"The world is now too small for violence; it is even too small for that intolerance which breeds voilence...paradoxically, as the world grows smaller men must grow larger."

—Dr. KIRK,
President of Columbia University.

"You who govern public affairs, what need have you to employ punishments? Love virtue, and the people will be vituous. The virtues of a superior man are like the wind; the virtues of a Common man are like the grass; the grass, when the wind passes over it, bends."

—HENRY DAVID THOREAU,
(Quoted in WALDEN)

# సోషలిస్ట్ సమాజ వ్యవస్థ

[ నూతనవ్యవస్థ సిద్ధాంత, కార్యక్రమాలపై ఆవడి కాంగ్రెస్‌లో
ప్రధాని నెహ్రూగా, కాంగ్రెస్ అధ్యక్షుడు ధేబర్‌ల
ప్రసంగాలు, ప్రముఖుల వ్యాసాల సంపుటి ]






ప్రతిభ సాహితి
విజయవాడ - 2

# విషయ సూచిక



" కేవల విజ్ఞాన శాస్త్రంగాని, సాంకేతిక విద్యగాని, పరిశ్రమ గాని యూరప్‌లోవలె ఇండియాలో వర్ధిల్లిన సూచనలు లేవు. అందువల్ల పారిశ్రామిక విప్లవం, పెట్టుబడిదారీవ్యవస్థ ప్రాబల్యం వహించలేదు. పారిశ్రామిక విధానం పాశ్చాత్య వర్తకులు, పాలకులు పాశ్చాత్య దేశాలనుంచి యిక్కడికి దిగుమతి చేసిందే. అయితే, వీరందరూ హైందవ విధానానికి లోబడే వ్యవహరించారు. హైందవుల వుదార సిద్ధాంతలనే అనుసరించారు. చివరకు అధికారం విసర్జించినప్పుడుకూడ భారతీయులకు శాంతియుతంగానే అధికారం అప్పగించి వెళ్ళిపోయినారు. శాంతియుతంగా అధికారం అప్పగించ బడటం కమ్యూనిస్టులకు ఆశ్చర్యం గలిగించింది. వారు తికమక చెందారు."

ఫిలిప్ స్ప్రాట్.

# ఉపోద్ఘాతం

మార్క్స్ సిద్ధాంతం ప్రకారం చారిత్రకంగా భూస్వామ్యదశ తర్వాత పెట్టుబడిదారీవ్యవస్థ యేర్పడుతుంది; యీదశలో స్వార్థం ప్రబలి, వ్యక్తిగత క్షేమం, భోగలాలసత్వముల కాకరమైన ఆర్థిక, రాజకీయ విధానాలు యేర్పాటుకాబడతాయ్. పారిశ్రామికాభివృద్ధి అధికతరం కావటంతో పీడిత, పీడన వర్గాలు రెండు ప్రముఖంగా తయారౌతాయ్, పీడకవర్గం పెట్టుబడిదారీవ్యవస్థ, పీడితవర్గం శ్రామికవర్గం. పారిశ్రామికాభివృద్ధి చరమస్థాయి కొచ్చేటప్పటికి ఆర్థికకారణాలవల్ల శ్రామికవర్గం చైతన్యవంతమై పెట్టుబడి దారి వ్యవస్థకు ప్రథమశత్రువుగా మారి యేక్షణంలోనైనా విప్లవంద్వారా ప్రభుత్వయంత్రాంగాన్ని స్వాధీనం చేసుకోవచ్చు. అలా విప్లవం విజయమైతే యీ శ్రామికవర్గం ప్రభుత్వయంత్రాన్ని హస్తగతం చేసుకొని శ్రామిక నియంతృత్వప్రభుత్వాన్ని స్థాపిస్తుంది. ఇదే యదార్థమైన ప్రజాస్వామిక వ్యవస్థ. పెట్టుబడిదారీవ్యవస్థ దుష్ఫలితాలవల్ల అత్యధికసంఖ్యాకులు శ్రామికులుగా తయారవటంవల్ల యీ అత్యధిక సంఖ్యాకుల పాలన ప్రజాపాలన అవుతుంది. అయితే యిటువంటి విప్లవాలు పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన దేశాల్లో రావటానికి యెక్కువ అవకాశాలుంటాయ్, ముఖ్యంగా యూరోపియన్ దేశాల్లో.

ఇదీ క్లుప్తంగా మార్క్స్ చారిత్రకవివరణ. మార్క్స్ డార్విన్ సిద్ధాంతీకరించిన పరిణామవాదాన్ని ఆధారంచేసుకొని చరిత్రకు గతితర్క భాష్యాన్ని వ్రాశాడు. ఆయనకంటె ముందు యూరోప్‌లో పలుకుబడి గలిగివున్న హెగెల్, కాంట్, లస్సవే, వగైరా తత్వవేత్తల్నే ఆధారంగా తీసుకొని తన సిద్ధాంతాన్ని రూపొందించాడనటం భావ్యంగా వుంటుంది. మార్క్స్ తన సిద్ధాంతాన్ని రూపొందించేనాటికి ఆసియాదేశాలు పశ్చిమదేశాల వలసలుగా పీడింపబడుతూవున్నాయ్. చైనా వగైరాదేశాలు స్వదేశీ భూస్వాముల, జమీందారుల క్రూరవిధానాల వొత్తిడితో సతమత మౌతున్నవి.

మార్క్స్ జోస్యంప్రకారం శ్రామికవిప్లవం పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన ఫ్రాన్స్, ఇంగ్లండ్, జర్మనీ దేశాల్లోగాక దారిద్ర్యపీడిత, వ్యవసాయకదేశమైన రష్యాలో కొద్దిమంది విప్లవ మనస్తత్వ మేధావుల కృషిఫలి

తంగా వచ్చింది. ఇందుకు రెండో ప్రపంచయుద్ధం కల్పించిన పరిస్థితులే కారణమనికూడ చారిత్రక జ్ఞానమున్న ప్రతివారికీ తెలుసు.

మార్క్సిస్టు సిద్ధాంతం రూపొందుతున్న దశలో భారతదేశంలో పరాయి పాలన కొనసాగుతోంది. ఇందుకు వ్యతిరేకంగా 1857 లోనే ప్రథమస్వాతంత్ర్యపోరాటం కొనసాగింది.

మార్క్సు సిద్ధాంతాలకొత్యా రూపొందినదే సోషలిజమనీ, దాన్ని ఒక్క కమ్యూనిస్టులు మాత్రమే అనుసరిస్తున్నారనీ, అవకాశం కలిగిన ప్రతి చోటా అట్టి సోషలిస్టువిధానం స్థాపించబడుతుందనీ, యిది కేవలం విప్లవం వల్లనే సాధ్యమౌతుందనీ చాలకాలంనుంచి అనేకమంది విశ్వసిస్తున్నారు. కాని అందుకు భిన్నంగా భారతదేశంలో పరిస్థితులు ఋజువుచేస్తున్నాయి. ఈనాడు మనం సోషలిస్టు సమాజవ్యవస్థను స్థాపించుకొనే యత్నంలో వున్నాం. అందువల్ల యింతకుపూర్వం సోషలిజంపేరుతో వున్న వ్యవస్థ స్వరూపమేమిటో, మనదేశంలో స్థాపించుకోబోయే వ్యవస్థ స్వరూపమేమిటో, వీటికి గల విభేదాలు యేమిటో స్థూలంగా పరిశీలించటం అవసరం. ఈ చిన్న పుస్తకంలో ఇదంతా సూక్ష్మంగా వివరించటం సాధ్యంకాదు. ఈ రెండు విభిన్న దృక్పథాలను పరిశీలించటం యీ పుస్తకం వుద్దేశంకాదు. మనవిధానం యేమిటో చెప్పటంమాత్రమే. అందువల్ల యిప్పటివరకు అమలులో, ప్రచారంలో వున్న విధానాన్ని స్థూలంగావివరించటమే యీ వుపోద్ఘాతం వుద్దేశం.

భారతదేశానికి మహోత్కృష్టచరిత్ర, మహోన్నతసాంప్రదాయాలున్నయ్. ప్రపంచానికినాగరికతాభిక్ష పెట్టింది యీ కర్మభూమి. ఏనాడు ప్రపంచంలో యెక్కడ సంక్షోభం, కల్లోలం యేర్పడినా దాన్ని నివారించటానికి భారతీ వాణి పలికింది. ఈనాడు ప్రపంచమంతా మహాకల్లోలంలో కొట్టుమిట్టాడుతున్న సమయంలో భారతవాణి నెహ్రూరూపంలో జయభేరి మ్రోగించి శాంతిప్రదాతగా కృషిచేస్తున్నది. ప్రపంచం విభిన్నసంఘర్షణ తత్వాలతో సతమతమౌతూ, యేది యేమిటో తెలియక, యేది యే ఫలితాల నిస్తుందో గ్రహించక దిక్కుతెలియనిస్థితిలో నున్నప్పుడు భారతదేశ శాంతి, అహింసల ప్రాతిపదికమీద నవసమాజ నిర్మాణానికి పునాదులను యేర్పరుస్తోంది. విస్పష్టంగా, నిర్దుష్టమైనవిధంగా నూతనవిధానాన్ని రూపొందించుకొంటున్నాం. దీనికి మన సత్సంప్రదాయాలే పునాది. మన ఆత్మవిశ్వాసమే బలం, ప్రజలే చైతన్యస్రవంతి.

మధ్యయుగంలో భిన్నాభిన్నమైన భారతీయ ఐక్యతాసాధనను బ్రిటీషుయుగ ప్రారంభం కొంతవరకు తోడ్పడింది. బ్రిటీషుపాలకులు తమ స్వార్థసాధనకు దేశసంపదను వినియోగించుకొన్నా, వారి వలసదేశ విధానం దేశంలో వ్యవసాయ, పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడలేదు. అందువల్ల రెండవ ప్రపంచయుద్ధకాలానికి మనదేశం యితర స్వతంత్రదేశాలవలె పెట్టుబడిదారీవ్యవస్థ వృద్ధిచెంది, పారిశ్రామికాభివృద్ధి జరిగిన స్థితిలో లేదు. జమీందారీయుగం అంతరించలేదు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతనే జమీందారీ, ఈనాముదారుల వ్యవస్థ ఒకవిధంగా పరిష్కరించటమైంది. ఆర్థికంగా వెనుకబడి, ముఖ్యంగా వ్యవసాయకదేశంగానే వుండిపోయింది.

ప్రపంచంలో యే యితరదేశమూకూడ కని విని యెరుగనివిధంగా భారతదేశం స్వాతంత్ర్యాన్ని సముపార్జించింది. దీనికి భారతీయులలో కలిగిన చైతన్యం, అంతర్జాతీయ పరిస్థితులు, బ్రిటన్‌కు స్వదేశంలో యేర్పడిన విపత్కర పరిస్థితి కారణాలుగా చెప్పవచ్చు. ముఖ్యంగా అప్పటికి 60 సంవత్సరాలుగా దేశవ్యాపితంగా జరుపబడిన జాతీయపోరాటమే కారణమని చెప్పవచ్చు. భారత జాతీయకాంగ్రెస్ నాయకత్వాన యిదంతా జరిగింది. అందువల్ల మనదేశంలో సైనికవిప్లవాలు, సాయుధవిప్లవాలు రావలసిన విషాదస్థితి యేర్పడలేదు. ఇదే గమనించవలసిన ముఖ్యవిశేషం.

అందువల్ల భారతదేశంలో పెట్టుబడిదారీవ్యవస్థ వ్యాప్తిచెంది వృద్ధి చెందలేదు. గనుక శ్రామికవర్గం అత్యధిక సంఖ్యాకంగా పెంపొందలేదు. అలాగా పారిశ్రామికాభివృద్ధి, వ్యాపారసంస్థలు వృద్ధికాలేదు. కొద్దిమంది పెట్టుబడిదారుల స్వార్థక్షేమాల పరిరక్షణకై జాతీయప్రభుత్వం కంకణం కట్టుకోలేదు. కనుక శ్రామికవిప్లవం రావలసిన అగత్యం, అవకాశం లేకుండా పోయింది. ఇక్కడ మార్క్స్ సిద్ధాంతాలప్రకారం చారిత్రకంగా యేర్పడవలసిన స్థితి యేర్పడలేదు. 150 సంవత్సరాల పరాయి పాలనక్రింద మగ్గిన భారతదేశం 8 సంవత్సరాలలో ప్రపంచ చరిత్రలో అపూర్వంగా, అద్వితీయంగా అభివృద్ధిచెంది వర్గవిభజన, వర్గకలహం లేకుండానే శాంతిమార్గాన పురోగామి, ప్రగతిశీలురైన నెహ్రూనాయకత్వాన నవసమాజ నిర్మాణానికి ఆయత్తమౌతున్నది: అనగా చారిత్రక పరిణామదశలను దాటకుండా, హింసాప్రయోగం జరక్కుండా పురోగమిస్తోంది దేశం.

స్టో. 2

సోషలిస్ట్ సిద్ధాంతానుసారం రెండో ఘట్టంలో ప్రవేశించాం. శ్రామికుల పేరుతో, సోషలిజం పేరుతో ప్రభుత్వాధికారం కొద్దిమంది విప్లవమనస్తత్వ మేధావుల హస్తగతమై నియంతృత్వం నెలకొనే దుర్దశ తప్పింది.

సమాజక్షేమానికి, పురోభివృద్ధికి పారిశ్రామికీకరణం, కేంద్రీకృత ఆర్థికవిధానం, ఉత్పత్తిసాధనాలన్నీ ప్రభుత్వపరం చేయబడాలనేది శాస్త్రీయసోషలిస్ట్ సూత్రం. స్థల, కాల విచక్షణ లేకుండా అన్వయించబడాలనేది మూర్ఖ సిద్ధాంతవాదుల ఆశయం. ఆసమగ్ర ఆర్థికస్థితిలో, పారిశ్రామికంగా, వ్యావసాయకంగా దేశంలో అభివృద్ధి యేమీ జరక్కుండానే ఉత్పత్తిసాధనాలన్నీ ప్రభుత్వపరం చేయబడితే, ప్రజలందరూ దివాళాకోరుస్థితిలో వుంటే దేశం పురోభివృద్ధి చెందుతుందనేది భ్రమజనిత విశ్వాసం. విప్లవాలు, శాస్త్రీయంగా గాకపోయినా, విజయవంతమైన దేశాల్లో జరిగిన దుష్ఫలితాలను చూస్తే యిదెంతవరకు వాంఛనీయమో బుద్ధిమంతులు నిశ్చయించుకోవచ్చు. శ్రీ నెహ్రూ "దివాళాకోరు ఆర్థికవిధానంమీద సోషలిజమ్ నిర్మించాలనుకోవటం వెర్రితనం" అన్నారు. ఇది పరమసత్యం.

ఇక్కడనే మన నవసమాజ నిర్మాణసూత్రాలు శాస్త్రీయ సోషలిజమ్ పేరుతో చెలామణీఅవుతున్న సిద్ధాంతసూత్రాలతో విభేదిస్తున్నవి.

ఈ నవసమాజ నిర్మాణవిధానంలో భూమిని ప్రభుత్వం స్వాధీనంచేసుకోక, రైతును దివాళాకోరుగా చేయక, భూమిలేని రైతులకుకూడ బంజరులను అవకాశమున్నంతవరకు పంచిపెడుతుంది. భూస్వాముల భూఖండాల పరిమితిని తగ్గించి గరిష్టపరిమాణాలు నిర్ణయించి, అదనపుభూమిని భూమిలేని రైతులకు పంచుతుంది. ఆవిధంగా వీలైనంతమంది స్వంతభూమికలిగిన రైతులు వృద్ధిచెందుతారు. ఆభూమిలో రైతుకు సర్వస్వత్వాలు వుంటాయి. అయితే వ్యవసాయం శాస్త్రీయపద్ధతులద్వారా చేయటానికి, అధికాహారోత్పత్తికి, భూసారం విలుప్తం కాకుండా కాపాడటానికి కావలసిన యంత్రాలు, వస్తుసముదాయసహాయాన్ని ప్రభుత్వం యిస్తుంది. ఇంకా సహకార వ్యవసాయ పద్ధతులను, రైతులయిష్టంతో ప్రోత్సహిస్తుంది.

ఈవిషయంలో ప్రపంచంలో అపూర్వమైన భూదానోద్యమం గుర్తింపదగినది. దున్నేవాడిదే భూమి అన్న సూత్రానికి నిజమైన అర్థం, విలువ యీనాటి మన భూదానోద్యమ, భూమి పంపిణీవిధానాలలోనే వుంది.

కీలక పరిశ్రమలను, భారీపరిశ్రమలు కొన్నిటినీ ప్రభుత్వం స్వాధీనం

చేసుకొంటుంది. గ్రామీణపరిశ్రమలు కొన్నిటిని ప్రయివేటురంగానికి వదిలివేస్తుంది. వ్యాపారసంస్థలు ఏర్పడినందున దుర్వినియోగం చేయకుండా, లాభాలు విపరీతంగా ఆర్జించేదృష్టితో కార్మికుల కడుపులు కొట్టకుండా అజమాయిషీ తీసుకొంటూ, కార్మికక్షేమంకోసం యెప్పటికప్పుడు, అవసరాన్నిబట్టి చట్టాలను చేస్తూవుంటుంది. వ్యాపారంలో దళారీలను తొలగిస్తుంది. ఇందువల్ల పెట్టుబడి కేంద్రీకరింపబడే ప్రమాదం తప్పుతుంది.

గ్రామీణపరిశ్రమలతోబాటు కుటీరపరిశ్రమల్ని విస్తారంగా స్థాపించే ఏర్పాట్లు చేస్తుంది. వాటికి ఆర్థికపుష్టికీ, వ్యాప్తికి తగువిధంగా సాంకేతిక, ఆర్థికసహాయం చేస్తుంది.

దేశానికి హృదయమువంటిదైన గ్రామాన్ని సర్వతోముఖంగా అభివృద్ధి చేయటానికి సర్వవిధాల కృషిచేస్తుంది. దేశవ్యాప్తంగా విద్య, ఆరోగ్యాభివృద్ధికి ఏర్పాట్లు చేస్తుంది.

ఇందుకుగాను జాతీయ విస్తరణ పథకాలు, సమాజవికాస కేంద్రాలను దేశవ్యాపితంగా స్థాపించి, గ్రామీణ, పట్టణ జీవితాలను అభివృద్ధిచేసి, యీ రెండిటిమధ్యనున్న వైషమ్యాలను మాపి సమగ్ర, సమన్వయ జీవిత దృక్పథాన్ని కలిగిస్తుంది.

దేశీయసంపదను సద్వినియోగంచేస్తూ, రవాణా, వ్యాపార వ్యవహారాలను తన అధీనంలో వుంచుకొని నిరుద్యోగసమస్యను నిర్మూలించ తీవ్ర కృషిచేస్తుంది.

ప్రజలు స్వయంశక్తిమీద ఆధారపడి, స్వయంకృషితో పాటుబడినప్పుడు నవసమాజనిర్మాణం విజయవంతంగా సాగుతుంది.దీనిలోవ్యక్తిగతశీలం ప్రధానపాత్రవహిస్తుంది. కుల, మత, వర్గ సంకుచిత దృక్పథాలు లేకుండ శాంతి, అహింస, సహనం, సహకారం మూలంగా సమగ్రజీవిత దృక్పథాన్ని అలవరచుకోవాలి. ఈపునాదిమీదనే నూతనతత్వం ఆధారపడివుంటుంది.

ఇప్పటికి 2500సంవత్సరాలనాడు బుద్ధుడు తనఅమరసందేశాన్ని ప్రాక్పశ్చిమ విభేదాలు లేకుండ సర్వప్రపంచానికి వినిపించాడు. ఆనాటినుంచీ యీ మధ్యకాలంలో యెందరో తత్వవేత్తలు, పాలకులు, సంస్కర్తలు మన దేశంలో ప్రభవించారు.

మళ్ళీ నేటికి విశ్వవ్యాపితంగా శాంతిస్థాపనావసరాన్ని, సర్వప్రపంచానికి పంచశీల సూత్రబద్ధమైన శాంతిసూత్రాన్ని మన ప్రియతమ నాయక

మణి నెహ్రూ వెలుగెత్తి చాటుతున్నారు. ఈ సిద్ధాంతమే విజయవంతమాతున్నది. అటువంటి నాయకుని సునిశిత బుద్ధిసూక్ష్మతవల్లనే మనకొక నూతన సిద్ధాంతం ఆవిర్భవించింది.

ఇది "పాత క్రొత్తల మేలుకలయిక". ఈ సిద్ధాంతం సమగ్రంగా ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలలోనూ, జాతీయవిస్తరణ కార్యక్రమాలలోనూ, సమాజవికాస కార్యక్రమాల్లోనూ స్పష్టంగా వ్యక్తీకరింపబడుతున్నది. దీనివిజయం ప్రజల సౌశీల్యంమీద ఆధారపడివుంది.

ఈ చిన్నపుస్తకంలో మన నూతనవిధానంగురించి శ్రీ నెహ్రూ ఢేబర్ ఆంగాగల ప్రముఖ కాంగ్రెస్‌నాయకుల అభిభాషణలు, వ్యాసాలు క్రమవిధాన పొందుపర్చబడినయ్. ముఖ్యంగా 1955 జనవరిలో ఆవడిలో జరిగిన కాంగ్రెస్ వజ్రోత్సవమహాసభలో రూపొందిన సిద్ధాంతసూత్రాలే యిందులో సమకూర్చబడినవి.

పాఠకులకు యీ నూతన విధానంయెడ ప్రాథమికజ్ఞానాన్ని కలిగించటం కోసమే యీపుస్తకం వుద్దేశించబడింది.

ఈకృషిలో విషయసేకరణ, అనువాదాలలో తోడ్పడిన మిత్రులు శ్రీ ఆలూరి నారాయణరావు, రామానంద సరస్వతిగారలకు అభినందనలు.

—సంపాదకుడు.

# కాంగ్రెస్ లక్ష్యాలు

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ

---

" సామరస్య పూర్వకమైన, పరస్పర క్షేమకరమైన సాంఘిక సంబంధ బాంధవ్యాలను నెలకొల్పుకోవాలనే హేతుబద్ధమైన వాంఛనుంచి నీతి ఉద్భవిస్తుంది. "

యం. యన్. రాయ్

'నవ్యమానవవాదం' లో

నేనుకాంగ్రెస్ అధ్యక్ష పదవినుంచి విరమించేయీ సమయంలో నాతర్వాత యీ స్థానాన్ని ఆక్రమిస్తున్న శ్రీ ధేబర్ ప్రభుత్వోద్యమ కార్యకలాపాలలో శక్తి సామర్థ్యాలు గలిగిన నైతిక సంపన్నుడు కావటం నాకు చాల సంతోషాన్ని కలిగిస్తోంది. అటువంటివ్యక్తి నాయకత్వాన కాంగ్రెస్ శోభిల్లుతుందని నావిశ్వాసం. నేను యీపదవినుంచి తప్పుకుంటున్నానంటే కాంగ్రెస్ కార్యకలాపాలలో నా శ్రద్ధాసక్తు లేమాత్రం తగ్గవని వేరుగా చెప్పనక్కర లేదు.

50 సంవత్సరాలనాడు నాబాల్యప్రాయంలో మొదటిసారిగా ఒక కాంగ్రెస్ సమావేశానికి వెళ్ళాను. 42 సంవత్సరాలక్రిందట మొదటిసారిగా కాంగ్రెస్‌కు ప్రతినిధినయ్యాను. అప్పటినుంచి యీ మహోద్యమంతో సన్నిహిత సంబంధం కలిగివున్నాను. షుమారు 30 సం॥రాల క్రిందట మొదటిసారిగా ప్రధాన కార్యదర్శి నయ్యాను. అప్పటినుంచి అనేకసార్లు ప్రధానకార్యదర్శి, అధ్యక్షపదవులను నిర్వహిస్తూ వచ్చాను.

ఆవిధంగా కాంగ్రెస్‌తోపాటుగా పెరుగుతూ యీ మహోద్యమంలో అసంఖ్యాక వ్యక్తుల సహచర్యాన్ని పొందాను. కాంగ్రెస్‌కు నేనెన్నడూ తీర్చలేనంత ఋణపడివున్నాను. నన్ను కాంగ్రెస్ తీర్చిదిద్ది, ఏ వ్యక్తికైనా బహు అరుదుగా లభించే సేవావకాశాలు నాకు లభింపజేసింది. కాంగ్రెస్‌తో సన్నిహితంగావున్న యీదీర్ఘకాలాన్ని గర్వంతో

కృతజ్ఞతతో స్మరిస్తూవుంటాను. ఈ సన్నిహిత సంబంధం కాంగ్రెస్ ద్వారా భారత ప్రజలతో వుంది. మనప్రజల వాత్స ల్యాన్ని అమితంగా చూరగొనే అదృష్టం నాకు కలిగింది. ఈ విశాల విశ్వంలో భారతప్రజల ప్రేమాభిమానాలను చూరగొనుటకంటె కావలసినది నాకింకేమీ కన్పించ లేదు.

గత 7½ సం॥లలో మనం అనేక సమస్యలతో పోరా డాము. ఈ పోరాటచరిత్రే యీ చైతన్య పూరితదశలో భార తీయచరిత్ర. ఇక్కడ మన జయాపజయాలను గురించి ప్రస్తా వించను. ఎందుకంటే అదొక దీర్ఘగాధ. పైగా అందరికీ తెలి సిందేకూడా. ఈ 7½ సం॥లలో భారతదేశం బహువిధాల ఎంతో పురోభివృద్ధి చెందిందని చెప్పటం సమర్ధనీయమే నను కుంటాను.

మనం మనగమ్యాన్ని చేరటానికి ఇంకా చాలాదూ రాన వున్నామని నాకు తెలుసు. దేశంలో కనపడీ కనపడ కుండా యెంతో నిరుద్యోగ సమస్య ప్రబలివుంది. మన జీవిత ప్రమాణం చాలా తక్కువ. మన దేశీయులందరికీ కనీసం జీవితావసరాలనుకూడా కల్పించ లేక పోయాము. కాని మనం సాధించిన అభ్యుదయం, మనకు కలిగిన విశ్వాసబలం భవి ష్యత్తువైపు ఆశతో పురోగమించేటట్లు చేస్తున్నాయ్.

నాకు తెలిసినంతవరకూ ప్రపంచంలో మరెక్కడా యిటువంటి పరిణామాలు శాంతియుత, సహకార మార్గాల ద్వారాసాధించబడలేదు. అలాజరగటానికి భారతీయుల మనో బలమే కారణం. మన స్వాతంత్ర్యమే గాంధిజీ ప్రబోధ, కార్యాచరణ విధానాల ఫలితంగా శాంతియుతంగా సాధించ

బడింది. పూర్వ ప్రతిపక్షవర్గమైన ఇంగ్లండుతో స్నేహసంబంధాలను నెలకొల్పుకున్నాం. అదేవిధంగా సంస్థానాలు, భూమివిధానం విషయాలలో కూడా పురోగమించాం. ఇటీవల ఆచార్య వినోబాభావే ప్రారంభించిన భూదాన, సంపత్తిదానోద్యమం సనాతన భారతీయ భావాలకు, విధానాలకు అనుగుణ్యంగా వుంది. పరిశ్రమల విషయంలో పూర్వతరం వాళ్ళతో విభేదించకుండా సోషలిస్టు సమాజవ్యవస్థ విధానాన్ననుసరిస్తున్నాం. ఈ విషయంలో పురాతన భావాలు కలవారి సహకారాల నర్థించి, కొంతవరకు పొందాం కూడా.

మహాత్మాగాంధి మనకు నేర్పిన ప్రథమపాఠం గమ్యాలను మార్గాలు పాలిస్తాయని, అందువల్ల మనమెప్పుడూ సుగమ్యసాధనకు కూడా దుష్టమార్గాల నవలంబించ కూడదు. బహుశా, మార్గాలకు ప్రాముఖ్యత నివ్వకపోవటమే ప్రపంచంలో యీనాడున్న అనేక కష్టాలకు కారణ మౌతున్నది. మనం సర్వదా కట్టుబడి వుండలేక పోయినప్పటికీ గాంధిజీ మనముందుంచిన సూత్రంలోని సిద్ధాంతపూర్వక సత్యతలో నాకు విశ్వాసంవుంది. నైతిక తత్వరీత్యా కాకపోయినప్పటికీ ఆచరణ సాధ్యపు వివేకం, స్వార్థక్షేమాలదృష్ట్యాకూడా గాంధిజీ మార్గాన్ననుసరించటం యెంతో వాంఛనీయం. అంతర్జాతీయ రంగంలో మన శక్తి కొద్దీ యిదేవిధంగా పాటుబడ్డాం. తత్ఫలితంగా వ్యథాకలితమై పతనావస్థలోవున్న ప్రపంచానికి భారతదేశం అమూల్య ప్రభావాన్ని కల్గిస్తోందని నావిశ్వాస. ఈమార్గాన్ననుసరించటంవల్ల మనదేశం సౌభాగ్యవంతమైంది. విదేశాలలో భారతదేశంపట్ల గౌరవం యినుమడించింది.

స్వదేశ రంగంలోకూడ అదేవిధంగా చేయటానికి ప్రయత్నించాం దేశంలో వర్గవిభేదాలు, సంఘర్షణలూ వున్నాయని, స్వార్థపరు లనేకమంది తమకు నష్టంగాపరిణమించే పరిణామాలను అడ్డగిస్తారని మనకు తెలుసు. సామాజిక, రాజకీయ సంస్కరణలకొఱకు చేసే యే ప్రయత్నమైనా తప్పనిసరిగా ప్రతిద్వంద్వ క్షేమాలమధ్య సంఘర్షణనుతీసుకొస్తుంది. ఈ ప్రతి ద్వంద్వ క్షేమాలను గుర్తించకుండా అలక్ష్యంచేసి మనం పురోగమించ ప్రయత్నించటం లేదు. కాని అట్టి సంఘర్షణలను ప్రోత్సహించి వుధృతం చేయం. ఎందుకంటే శాంతియుత, స్నేహపూర్వక మార్గాల ద్వారానే ఆ సమస్యలు సవ్యంగా, శాశ్వతంగా పరిష్కరింప బడుతాయనే విశ్వాసం మనకు సంపూర్ణంగా వుంది. క్షేమాల సంఘర్షణ వున్నచోట ప్రజలందరి సమిష్టి క్షేమంకూడ వుండాలి. అందువల్ల యితరులను బాధించే ఆశయంకాని, హింసా,ద్వేష భావాలనువ్యాప్తి చెందించటం కాని అవసరంలేదు. హింసాద్వేషాలవల్ల చివరకేవిధమైన శ్రేయస్సూ కలుగదు.

ప్రపంచంలోని వివిధదేశాలు పరస్పరం అసహనంతో ప్రవర్తిస్తున్న సమయంలో సహనంకేవలం సద్గుణంగానే కాక, జాతీయ రంగంలోకాని, అంతర్జాతీయ రంగంలోకాని అనుసరింపదగిన, ఆచరణ యోగ్యమైన మార్గ మిదొక్కటేనని గుర్తుంచుకోవాలి. తక్కిన యితర మార్గాలన్నీ సంఘర్షణను, తనాన్ని తెచ్చిపెడతాయి. అంతర్జాతీయ రంగంలో దీన్ని హాజీవనమని పిలువవచ్చు. ఇంకా తోటిదేశాలతో కలిసి అంగీకారాని కొచ్చిన పంచసూత్ర, పంచశీల విధానాన్నన్వ

యింప జేయటమనికూడ యనవచ్చును. ఈ సహజీవనమంటే యుద్ధం, సంఘర్షణలను నివారించట మొక్కటేకాదు. ప్రతి దేశం తమ యిష్టం వచ్చినరీతిని బ్రతకటం, యితరుల విష యంలో జోక్యం కలుగజేసికోకపోవటం, యితర దేశాలతో స్నేహపూర్వకంగా వుండటం అనే విషయాలను, పరస్పరం విభిన్న మార్గానువర్తులైనప్పటికీ, గుర్తించటమన్నమాట.

భారతదేశం తననుతాను తెలిసికొంటున్నది. ఇతర దేశాలనుంచి యెంతోమంచిని నేర్చుకొంటున్నది. అయినప్ప టికీ పూర్వంలాగే స్వదేశంలోనేవుండి స్వసాంప్రదాయాల మీదనే ఆధారపడి పురోగమిస్తోంది. మనకు సంకుచిత జాతీయ తత్వంలో విశ్వాసం లేదు; యీనాటి ప్రపంచంలో యీ తత్వానికి స్థానం లేదనికూడ గుర్తించాం. అందువల్ల ప్రపంచంలోని ప్రతిదేశంతోనూ స్నేహ సంబంధాలను నెల కొల్పుకొని బలపర్చుకొంటున్నాం. కాని భారతదేశ మభ్యు న్నతి చెందాలంటే యే విదేశాన్నీ అనుసరించకుండా స్వీయ సంప్రదాయాలకే కట్టుబడి వుండాలి. గత కొన్ని శతాబ్దాలలో చైతన్య రహితంగా మానవాభ్యుదయ ప్రవాహ మార్గానికి దూరమై పోయాం. కాని మనకింకా పురాతన జాతి యను భవం, సత్వ్రభావం మిగిలివున్నై. గతకాలంలో నష్ట డి దాన్ని పూడ్చుకొనే సామర్థ్యంకూడ వుంది. ఈనాడు భా తా ంవియంతటా పునరుజ్జీవితమౌతున్న కళ, శాస్త్రాలు, జాతీయ భాషల్లో వుత్పన్నమౌతున్న నవ్య సాహిత్యరీతులు, సం నృత్య, గేయాలపట్ల వ్యక్తమౌతున్న అభినిరతిని తిల హృదయముప్పొంగి పోతూంది. బహురూపాల్లో ప్రద

మయ్యే జానపద నాట్యంలో అభివ్యక్తమవుతున్న యిరువది ఒండిన శ్రద్ధాసక్తులు, భ్రాంతియులు తమ నవస్వేచ్ఛా జీవితంలో పొందుతున్న అభ్యుదయ,ప్రమోదాలకు ప్రబలసాక్షులుగా కనిపిస్తున్నయ్. విషాదపూరితమైన వారి గతజీవితం నవికసితమౌతూ నెమ్మదిగా పూర్ణత్వం చెందుతున్నది.

శాంతియుత కార్యాలకు యుద్ధకార్యాలకు, పరమాణుశక్తి నుత్పత్తి చేయటంతో పరిపూర్ణమైన పారిశ్రామిక విప్లవం నాగరికత సంక్షుభితమై, ప్రపంచం మొదతెగని సంక్షోభంలో పడి కొట్టుకొంటోంది. ఈ సక్షోభం వివిధ దేశాలలో వివిధ రూపాలలో ప్రదర్శిత మౌతోంది. ఏదేశానికీ దీనినుంచి ముక్తి లేదు. అధిక పారిశ్రామికీకరణ జరిగిన పశ్చిమదేశాలలో యీ సంక్షోభ మత్యంత తీవ్రంగావుంది. అభివృద్ధికాని ఆసియా దేశాలలో మనం పారిశ్రామిక విప్లవ ప్రాంగణంలో వున్నాం.

మనలో చాలమంది పారిశ్రామిక విప్లవ ఫలితాలను హర్షించక మనదేశంలో పారిశ్రామికాభివృద్ధినినిరసిస్తున్నారు. పారిశ్రామికీకరణవల్ల మహిమాన్వితమైన కార్యాలు సాధించబడినప్పటికీ దానితాలూకు దుష్టఫలితాలుకూడా విధిగా అనుసరిస్తాయి. ఆ దుష్ఫలితాలులేకుండా మన మహా ఘన కార్యాలను సాధించ గలమా ?

భారతదేశ పారిశ్రామికీకరణకు మనం స్వకీయమార్గాన్నవలంబించి పారిశ్రామికాభి వృద్ధితోపాటు శీఘ్రగతిని పురోగమించటమే మన కర్తవ్యం. అలాకాకపోతే వెనుకబడి అభివృద్ధిలేక బలహీనమైన, దరిద్రపీడిత దేశంగా మిగిలిపోవటమే గత్యంతర మౌతుంది. పారిశ్రామికాభివృద్ధి లేకుండా మన

స్వాతంత్ర్యాన్నికూడా కాపాడుకోలేం. మన జనాభా యిప్పటికంటె చాలా తక్కువగావుండి, సాంకేతిక విజ్ఞానశాస్త్ర మభివృద్ధి చెందని దశలో వ్యవసాయక ఆర్థిక విధానం సరి పోయి వుండవచ్చు. కాని యీనాడాపద్ధతి ననుసరిస్తే వుప వాసాలు, అంతకంటె హీనమైన బ్రతుకుతప్ప మరొకటుండదు.

అందువల్లనే వీలైనంత శీఘ్రగతిని పారిశ్రామికీకరణ పెంపొందించ వలసిన తక్షణావసర మేర్పడింది. అంటే భవి ష్యదభివృద్ధికి పునాదులనువేసే భారీపరిశ్రమలను విస్తరింప చేయట మన్నమాట. మొదటి పంచవర్ష ప్రణాళికలో వ్యవ సాయానికి, ఆహారోత్పత్తికి ప్రత్యేకశ్రద్ధ తీసుకొన్నాం. ఆనా డది అతిముఖ్యమైన తక్షణ సమస్యయేకాక పరిశ్రమల నిర్మాణానికి వ్యవసాయక స్థిరత్వం మూలంగాకూడా వుండవల సిన అవసరం వుంది. ఇప్పుడు వ్యవసాయక, ఆహారోత్పత్తి రంగాలలో ఘనవిజయాన్ని సాధించాం. ఇక నిప్పుడు పారిశ్రా మికరంగంలో శీఘ్రగతిని పురోగమించాలి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నిస్సందేహంగా పరిశ్రమలు, వుద్యోగావకాశాల మీద విపరీతమైన శ్రద్ధ చూపెట్టబడుతుంది.

పంచవర్ష ప్రణాళికకు విధానాలను, కార్యక్రమాలను రూపొందించుకునే దశలో వున్నామిప్పుడు. మనకు కల్గిన అను భవాన్ని, లెఖల వివరాలను పురస్కరించుకొని పై రెండు కార్యక్రమాలను సవ్యంగా నిర్ణయించుకొనే స్థితిలో వున్నాం. కేవలం ఆర్థికావకాశాలనే కాక ప్రజల అవసరాలను ముఖ్యంగా గమనించే భౌతికస్థాయిలో యదార్థమైన ప్రణాళిక యిప్పుడు ప్రారంభ మౌతున్నదని చెప్పవచ్చు. ఈ ఆశయసా

పూర్వం వలెకాక విభిన్నమార్గాన్నవలంబించాలి. అత్యధికోత్పత్తి, సంపూర్ణంగా వుద్యోగావకాశాలను కల్పించటమనేవి ప్రధానాశయాలుగా వుంటాయి.

మన యీప్రణాళికయొక్క సామాజిక ప్రయోజనం సోషలిస్టు సమాజ వ్యవస్థాస్థాపనఅని చెప్పబడుతోంది. ఈ ఆశయమే కాంగ్రెస్ ఆశయంలో అంతర్భూతమైవుంది. ఈ విషయాన్ని స్పష్టంగా వివరించి, ప్రణాళిక దశలన్నిటిలోను ఆ లక్ష్యాన్నే గుర్తుంచుకొని కృషిచేయాలి. సోషలిజమం అనేకర్థాలున్నై. ఈ విషయంలో సూటిగానూ, సిద్ధాంత మూర్ఖత్వంతోనూ మన దృక్పథాన్ని రూపొందించుకోనక్కర లేదు. అది వాంఛనీయంకూడా కాదు. అంతేకాక యితర దేశాలలో పరిస్థితులు మనవాటికంటె పూర్తిగా విభిన్నంగా వున్నచోట, సోషలిజమంటే యేమి చెప్పబడిందో, ఆపేరుతో యేమిచేయబడిందో దాన్నే మనమనుసరించటం శ్రేయస్కరం కాదు. ప్రతిచోటా అన్వయింప చేయదగిన కొన్ని సామాన్య లక్షణాలు, కొన్ని సామాన్యసూత్రాలూ తప్పనిసరిగా వుంటాయి. కాని ప్రతిదేశంకూడా తన స్వీయనిర్ణయాల ననుసరించి, స్వీయాభిప్రాయాను సారం నడచుకోవాలి. మహత్తర వ్యక్తిత్వం, మహోన్నత చరిత్ర, బలీయమైన సాంప్రదాయం కలిగిన భారతదేశంలో ప్రత్యేకంగా పై విధాన్ననుసరించాలి. ఆ చరిత్ర, ఆ సాంప్రదాయాలే మన స్వాతంత్ర్యోద్యమాన్ని నడిపి నేటిదశకు తీసికొచ్చాయి.

ప్రప్రథమంగా హింసను త్యజించటం అతిముఖ్యం. ఎందుకంటే అది స్వభావరీత్యా దుష్టమైనది. కనుక

దాని ఫలితాలుకూడా విచ్ఛిన్నకరమైనవి, దుష్టభూయిష్టమైనవీ గానే వుంటాయిగనుక. కాంగ్రెస్ కేవలం శాసనసభాప్రవేశాన్ని కాంక్షించే ఒక రాజకీయ పార్టీమాత్రమే కాదని, కోట్లాది భారతీయ ప్రజలతో పాటు మనలక్షిత గమ్యాన్ని చేరుకోవటానికి అడుగిడుతున్న మహా జాతీయోద్యమమని మనవరాము. మనం వారితో ప్రయాణిస్తూ వారిని సవ్యమార్గాన నడపటానికి నాయకత్వం వహించ ప్రయత్నించినప్పటికీ వారికంటె ముందుకు పోలేం. దేశం మొత్తం మీద ప్రజాభిప్రాయాన్ని సమన్వయ పరచాలి. మనం శాంతి స్వాతంత్ర్యాలను సాధించాలి. ఈ రెండూ పరస్పరాధారభూతాలు. ఈ రెంటిలో యే వొక్క-దాన్ని విడిగా తీసికొన్నా అర్థరహిత మౌతుంది. దీనంతటికీ అర్థమేమిటంటే బహుసమస్యాపూరితమైన వర్తమానాన్ని సవ్యమైన చారిత్రక దృక్పథంతో వీక్షించి అర్థంచేసుకొనే పద్ధతిని తెలియజేస్తుంది.

మన జాతీయలక్ష్యం శ్రేయోరాజ్యం, సోషలిస్టు ఆర్థిక విధానం. జాతీయాదాయాన్నత్యధికంగా అభివృద్ధిచేయకుండాను,అధికోత్పత్తినిసాధించకుండాను సంపూర్ణోద్యోగవకాశాలను కల్పించకుండాను పైలక్ష్యంలో యేవొక్క-భాగమూ సాధించబడదు. సోషలిస్టు విధాన శ్రేయోరాజ్యాన్ని స్థాపించాలంటే తీర్మానాలు, చట్టాలుచేయడంవల్ల గాని,ప్రస్తుతం వున్న పరిశ్రమల్ని జాతీయంచేసి వూరుకోవటం వల్లకాని సాధ్యం కాదు. ఉత్పత్తి నధికతరం చేయాలి, సమృద్ధికరమైన ఆర్థిక విధానాన్ని లక్ష్యంలో వుంచుకోవాలి, జాతీయసంపద న్యాయ

సమ్మతంగా పంపిణీ జరిగేటట్లు చూడాలి. వ్యక్తుల, ముఖ్య ప్రత్యేకావకాశాల స్థితిని సమర్థించబోము.

అందువల్ల సంపూర్ణోత్పత్తికి, అందరికీ వుద్యోగాలు దొరికే దారికనువగు ప్రతి విధానాన్ని ప్రోత్సహించవలసి వుంది. అయితే మనగమ్యమైన సోషలిస్ట్ సమాజవ్యవస్థకు మన లను దూరంచేయని విధంగా వుండాలి. సంపూర్ణోత్పత్తి, సం పూర్ణోద్యోగావకాశాలు లేకపోయి నట్లయితే మనం కొన్ని పరిశ్రమల్ని జాతీయం చేసినప్పటికీ, సాహసోపేతమైన చట్టా లను చేసినప్పటికీ శ్రేయస్సూ వుండదు, సోషలిజమూ వుం డదు. అధికోత్పత్తిని లక్ష్యించి నట్లయితే, యీవుత్పత్తి ప్రజా వసరాల వినియోగం కోసమైనపుడు, ప్రజలకు కొనుగోలుశక్తి వున్నప్పుడూ మాత్రమే అదిసాధ్యమౌతుంది. ఈ లక్ష్యాన్ని సాధించటానికి ఆర్థిక, జాతీయ జీవిత రంగాలలో నొక ప్రత్యేక చైతన్యవంతమైన పద్ధతిని ప్రవేశపెట్టాలి. ఏదోవొక సిద్ధాంత సూత్రమేకాక సాధించబడిన ఫలితాలే యెప్పుడూ గీటురా యిగా వుండాలి.

వ్యక్తిగత ఐచ్ఛిక వ్యాపారరంగానికి, ప్రభుత్వాధీన వ్యాపార రంగానికీ మధ్యనుండే సంబంధ ప్రాముఖ్యతమీద కొనసాగుతున్న వాదప్రతివాదాల కీపరీక్షను పెట్టాలి. ప్రభుత్వ పరమైన ఆర్థిక వుత్పత్తి సాధనాలు, పంపిణీ ప్రభుత్వ అజమా యిషీలో వుండటం తప్పనిసరౌతుంది. ప్రణాళికా నిబద్ధమైన ప్రభుత్వాధీనఆర్థికవిధానంలో ప్రభుత్వపరమైనవ్యాపారరంగం ముఖ్య స్థానా న్నాక్రమించటం కూడా తప్పనిసరౌతుంది. స్తుతం వున్న సంపదలను ప్రభుత్వరంగానికి ప్రత్యేకించటం

మూశీ వుత్పత్తి పెరుగుదలావకాశాలను పరిమితం చేయట మౌతుంది. సోషలిస్టు విధాన సమాజంలో వుత్పత్తి, పంపిణీల కవరోధాలను తొలగించటమే ప్రధానలక్ష్యంగా వుండాలి. సోషలిజంపేరుతో కొన్ని అవరోధాల నలాగేవుంచి లేక వాటిని ప్రోత్సహించే విధానాన్ని మన మవలంబించినట్లయితే మనలక్ష్యానికి దూరులమై, చైతన్యపూరిత గమనా న్నరికట్టు తున్నామన్న మాట. అందువల్ల మన ప్రణాళికా నిబద్ధ కార్య క్రమంతో సహకరిస్తూ వున్నంతవరకూ వ్యక్తిగత వ్యాపార రంగాన్నికూడా ప్రోత్సహించి, తనపాత్రను సంపూర్ణంగా నిర్వ హించే అవకాశాలను కలిగించట మవసరమౌతోంది.

సోషలిస్టు విధాన సాధనాశయాన్ని సర్వదా దృష్టిలో వుంచుకొని తత్సాధన కవరోధం కానంతవరకూ వ్యక్తిగత వ్యాపారరంగంవిషయంలో మనశ్రేయోదాయకమైన విధానా న్ననుసరించాలి. ప్రభుత్వపరమైన వ్యాపారంతోపాటు వ్యక్తి గతమైన వ్యాపారంకూడా వున్ననాడు ప్రస్తుతపరిస్థితులలో యీరెంటికి మధ్య పోటీయేర్పడి ఆరోగ్యకరమైనస్థితి యేర్పడ వచ్చు. మనం తయారుచేస్తున్న యీ బృహత్ప్రణాళికకు సంపూర్ణోత్పత్తి, సంపూర్ణోద్యోగావకాశాలు కలగటమే గీటు రాయని సర్వదా జ్ఞాపకముంచుకోవాలి.

మన పరిశ్రమలను బహుళంగావిస్తృతంచేసే దశలో వున్నామని నానమ్మకం. ఇందుకుగాను మనకున్న సర్వసంపద లనుసంపూర్ణంగా వినియోగించాలి; యేమాత్రపు దుర్వినియో గాన్ని భరించలేము. ఆర్థికవిషయం ముఖ్యమైనప్పటికీ మనకు వస్తున్న పారిశ్రామిక విప్లవంలో సిబ్బంది తర్ఫీదుకావటం

మరింత ముఖ్యమైన విషయం. తర్ఫీదుపొందిన సిబ్బంది లేని నాడు మన పురోగమనవేగం కుంటుబడే ప్రమాదం వుంది. మనకు కావలసినంత మానవశక్తి లభ్యమై వుంది. ఒకొక్కప్పుడు పెట్టుబడికంటె యీశక్తే యెక్కువగా పని చేస్తుంది. కాని శిక్షిత మానవశక్తి లేకుండా ఎంతోదూరం పోలేము. అందువల్ల దూరమాలోచించి మన ప్రణాళికలో జాతీయ కార్యక్రమ శాఖలన్నిటిలోను తగినంతమందికి శిక్షణ నిస్తూ ముందుకుసాగాలి.

మనం పెద్ద పరిశ్రమలెంత అభివృద్ధి చేసినప్పటికీ కుటీర, చిన్న పరిశ్రమల్ని బహువిస్తృతంగా అభివృద్ధి చేయటం మీద తప్పనిసరిగా యెక్కువ శ్రద్ధను చూపించాలి. కాంగ్రెస్ యెప్పుడూ కుటీర పరిశ్రమ లభివృద్ధికోసమే పాటుపడుతోంది. ఈనాడట్టి అవసరం మరింత అధికమైంది; నిరుద్యోగులకు వుద్యోగావకాశాలు కల్పించటానికి, వుత్పత్తిని పెంపొందించ టానికి యింతకంటె మరొక సుగమ మార్గంలేదు. మన మనుసరించే మార్గం ప్రణాళికాబద్ధమై, సమబద్ధమైన దైనప్పుడు పెద్ద పరిశ్రమలకు, కుటీరపరిశ్రమలకు మధ్య ప్రాధమిక సంఘర్షణ యేర్పడే అవకాశం నాకేమీ కన్పించటంలేదు.

భారతీయులమైన మనమంతా పై చెప్పిన జాతీయ, అంతర్జాతీయ సమస్యలను నూతన దృక్పధంతో పరిశీలించాలి. బహుశా మనలో చాల కొద్దిమంది మాత్రమే సృజనాత్మక దృక్పధంతో పరిశీలిస్తారని నేననుకుంటాను. కాంగ్రెస్ ఆలో చనాక్రమంకూడా స్తబ్దంగా వుండటాని కవకాశం వుంది. ఇతర లు స్వీయనిర్మితమైన గిజిగాని గూళ్ళల్లో యిరుక్కొని

త్రున్నాయి. కాలతత్వ పార్టీ ఎంతసేపూ మధ్యయుగపు మత తత్త్వాన్నే ప్రదర్శిస్తూ, అపసవ్యంగా ప్రవర్తిస్తున్నాయ్. ప్రజా సోషలిస్ట్ పార్టీ పట్టుతప్పి విచ్ఛిన్నమయ్యే పరిస్థితిలో పడినట్లు కనిపిస్తోంది. ఈనాటి సమస్యల్ని ధైర్యంగా ఎదుర్కొనక శుష్క నినాదాలను శక్తివంతమైన మంత్రాలనుకొని పదే పదే వల్లించటంతోనే కాలం గడుపుతున్నది. కమ్యూనిస్టు పార్టీ ధైర్యంగా, భీకరంగా మాట్లాడినప్పటికీ, ఇతరులవద్ద చదివి, నేర్చుకొన్నదాన్ని మాత్రమే వల్లిస్తూ, మన సమస్యలయెడ జాతీయ వ్యతిరేక, అభివృద్ధినిరోధక దృక్పథాన్ని ప్రదర్శిస్తోంది. ప్రపంచం, ప్రపంచ సమస్యలు మారుతాయి కాని భారత కమ్యూనిస్ట్ పార్టీ మాత్రం, భూతకాలంలోనే బ్రతుకుతూ, మారదు. ఇంకా హింసాత్మక, విచ్ఛిన్నమార్గాన్నే అనుసరించాలని చూస్తోంది. ఆ మార్గాన్నే ఏదో మంచి జరుగుతుందని వారి ఆశ. ఇతరులమీద ఆధారపడితే స్వయం బుద్ధి యేవిధంగా నిర్వీర్యమౌతుందో తెలుసుకోవటానికి ఇదొక విచిత్రోదాహరణ. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినదన్న విషయాన్నింకా గుర్తించలేదు. ఒకటి, రెండు సంవత్సరాల క్రితంవరకూ కమ్యూనిస్ట్ పార్టీ భారత రిపబ్లిక్ దినోత్సవాలను వ్యతిరేకిస్తూనేవుంది. ఇంతకంటే జాతీయ వ్యతిరేక తత్వం, అసంబద్ధ దృక్పథం నేనూహించలేను. ఇప్పటికీ వీరు పైకి గంభీరంగా, బిగ్గరగా కేకలు వేయటంవల్ల కొంతమంది భ్రమ పడుతున్నారు. ఈ పార్టీకి భారతదేశ సమస్యల పరిష్కారానికి సమగ్ర నిర్మాణాత్మక కార్యక్రమం లేదని నానాటికీ స్పష్టమౌతున్నది. ఈ పార్టీ కేవలం వ్యతిరేకతను, విచ్ఛిత్తిని

మాత్రమే సాధించగలదు.

ఈ పార్టీలన్నిటికీ కాంగ్రెస్‌ను, కాంగ్రెస్ అధీనంలో వున్న ప్రభుత్వాలను తిట్టిపోసే ఒకే సామాన్యలక్షణం వుంది. సృజనాత్మక నిర్మాణదృక్పథం లోపించి, తికమకలతో రోజు రోజుకూ దిగజారిపోతూ కేవలం కృత్రిమంగా తయారౌతున్నవి. అందువల్ల కాంగ్రెస్‌పై విపరీతమైన భారం పడింది. కాంగ్రెస్ దీర్ఘంగా, సృజనాత్మకంగా ఆలోచించి వ్యవహరించవలసిన అవసర మెంతో కలిగింది. కాంగ్రెస్ నేటి సమస్యల నెదుర్కోని, యితరులవలె అభావ దృక్పథంతో కాక, పరిష్కరించాలి. మన ఆలోచన, మన పథకాల, కార్యాచరణ విషయాల్లో స్వశక్తిమీదనే ఆధారపడి వుండాలి.

మన మహాదేశాని కనుగుణ్యంగావున్న మహోన్నత, మహోత్కృష్ట కర్తవ్యం యిది. దీని నిర్వహణకు మనప్రజల్లో బహువిధ సద్గుణాలు పెంపొందాలి; ముఖ్యంగా యీ మహోద్యమంలో సభ్యులమని గర్వంగా చెప్పుకోగలిగిన వారిలో మరింతగా పెంపొందాలి. ఇందుకు చైతన్యపూరిత, నిర్భీక దృక్పథం కావాలి. ప్రపంచాన్నినాడు భయభీతు లావరించివున్నాయి; గొప్పవి, బలమైనవి, శక్తివంతమైనవి అనుకొనే దేశాలు యేమి జరుగనున్నదోననే భీతితో తల్లడిల్లి పోతువి. భీతి ద్వేషాన్ని, హింసాపూరిత స్వభావాన్ని రెచ్చగొడుతుంది పూర్వం మన భారతదేశంలో నిర్భయం వొక వున్నతమైన సద్గుణంగా పరిగణింప బడేది. గాంధీజీ యీ విషయమై సరళమైన, లలితమైన భాషలో మనకు ప్రబోధించారు. ఆయన భారతదేశంలో తన మహోద్యమాలను ప్రారంభించి నప్పుడు

ఉద్యమ నాడే మారుమూలాలకు గ్రామాలకుకూడ ప్రసరించి,విచిత్ర ప్రభావాన్ని కలిగించింది. అనేకతరాల పరాయి ప్రభుత్వ పాలనలో బలహీనులై, భీతచిత్తులై, నిర్వీర్యులైన మన ప్రజలు మహాత్ముగా, అద్భుతంగా, నిర్భయులై మహా సామ్రాజ్యబలాన్నెదుర్కొన్నారు. ఇప్పుడింకా దేన్నిచూచి భయపడాలి? ఇప్పటికే యెన్నో కల్లోలాలను, సంక్షోభాల నెదుర్కొన్నాం. ఇకముందు మనమార్గంలో యెదురయ్యే యెటువంటి క్లిష్టసమస్యలనైనా, విపత్కర పరిస్థితులనైనా యెదుర్కొని నిలబడగలం.

కాంగ్రెస్ తన కర్తవ్యాన్ని సమర్థనీయంగా ప్రతిభావంతంగా నిర్వహించాలంటే తన ఆదర్శాలకు కట్టుబడివుండటమేగాక అత్యుత్తమమైన నైతికశీలాన్ని, ప్రవర్తనల నలవరచుకోవాలి. ఈ నైతికశీల ప్రమాణాలు నశించిపోయి, కాంగ్రెస్ వాదులమని చెప్పుకొనేవారిలో అవినీతి ప్రబలి వారు కాంగ్రెస్ ప్రతిష్ఠకే భంగకరమైన రీతిని ప్రవర్తిస్తున్నారని చెప్పటానికి నాకెంతో బాధగావుంది. మనం వుత్తమ నైతిక ప్రమాణాలను కాపాడుకోలేక పోయినట్లయితే మనకర్తవ్యాన్ని విస్మరించి మనకు మార్గంచూపిన జ్యోతిని ఆర్పివేసిన వాళ్ళ మతాం. కాంగ్రెస్ యెప్పుడూ సంఖ్యాబలంమీద తన శక్తినచనా వేసుకోలేదు. తన సభ్యుల ఋజువర్తన, సేవాత్యాగాల ఫలితంగానే బలపడి ప్రజల వాత్సల్యాభిమానాలనూ చూరగొన్నది. ప్రతి కాంగ్రెస్‌వాది తానెంతవరకూ నైతి

ప్రమాణాలను కాపాడుతూ ఋజువర్తనుడౌతున్నాడో అన్న పరీక్ష చేసుకొని నిర్ణయించుకోవటం చాల ముఖ్యం. అల్పులు ఘనకార్యాలను చేపట్టలేరు.

( 1955 జనవరిలో ఆవడిలో జరిగిన కాంగ్రెస్ వజ్రోత్సవ మ సభలో కాంగ్రెస్ అధ్యక్షపదవినుంచి విరమిస్తూ యిచ్చిన ప్రారంభోపన్యాసం- సంక్షిప్త రూపం )

# సోషలిస్ట్ సమాజ వ్యవస్థ

శ్రీ యు. యన్. ఢేబర్



" ... సంఘర్షణాలను తొలగించి ప్రపంచానికి శాశ్వతశాంతి చేకూరేటట్లు చేయగలిగిన రాజ్యమేదైనా వుంటే అది భారత దేశం ఒక్కటే. అలాగే ప్రపంచాన్ని సర్వనాశనకర పరిస్థితి నుంచి రక్షించగలిగింది గాంధేయ సిద్ధాంతం ఒక్కటేనని నేను ఘంటాపథంగా చెప్పగలను. "

రెజినాల్డ్ రేనాల్డ్స



భాక్రానంగాల్ ప్రాజెక్టులోని నంగాల్ డామ్



నంగాల్ డామ్ విద్యుచ్ఛక్తి యంత్రాల నిర్మింపబడుతున్న దృశ్యం

నేను మీ సమక్షంలో యీ 60 వ కాంగ్రెస్ మహాసభ అధ్యక్షపీఠాన్ని కొంచెం భీతచిత్తముతోనే అధిష్టిస్తున్నాను. దేశసేవచేసిన త్యాగశీలురును, ప్రతిభాశాలురును, నైతిక గుణసంపన్నులును, మహానాయకులు అయిన భారత పుత్రీ, పుత్రులకే యీ గౌరవస్థానం లభ్యం కాదగినది. ఈ రెండు అర్హతలు నాయందు లేవని నాకు తెలుసు. అయినప్పటికీ నాయకుల ఆజ్ఞను శిరసావహించి యీ గురుతరబాధ్యతను స్వీకరించడానికి సాహసించాను. అందువల్ల మీ అందరి సహకారాన్ని అర్థిస్తున్నాను. విశ్వాసాదరణలతో మీరు నాయందుంచిన యీ బాధ్యతానిర్వహణ కింకా సమర్థత పొందవలసి వున్నానని గ్రహించి, మీ అందరి సహకారాన్నాశిస్తూ, శక్తికొలది సేవ చేయుటకు ప్రయత్నిస్తానని హామి యిస్తున్నాను.

ఇది 60 వ భారత జాతీయకాంగ్రెసు మహాసభ కావడం చేత దీనితోబాటు వజ్రోత్సవంకూడా జరుపుకుంటున్నాం. ఈ మహాసంస్థ గత 70 సంవత్సరాలనుండి పారతంత్ర్య, అజ్ఞాన, దారిద్ర్యవిముక్తికి అవిరళంగా పవిత్రకృషి సల్పింది. గతంలో కొన్నివర్గాల్లో, కొన్నిప్రాంతాల్లోనో విదేశదండయాత్రలనెదుర్కొనడం జరిగినది, గాని, కుల, మత, వర్గ విచక్షతలులేకుండ యావద్భారతజాతి యేకోన్ముఖంగా ఒకేసంస్థ యాజమాన్యం క్రింద సమరం సాగించి స్వాతంత్ర్యాన్ని సముపార్జించడం మనదేశచరిత్రలో యేకకంలోను కని విని యెరుగము.

మరోవిధంగాచూచిన భారతచరిత్రలోనేగాక ప్రపంచ

చరిత్రలోనే మనది అసమాన సంస్థ. నిరక్షర, నిరాయుధ ప్రజానీకాన్ని సమీకరించి, ఉన్నతమార్గాన (హుండాగా) సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించగలిగిన సంస్థ మరొకటి ప్రపంచచరిత్రలో లేదు.

మీకు, మీద్వారా కాంగ్రెసువాదులకు, సానుభూతి పరులకు నా ధన్యవాదాలు. జాతిపిత మహాత్మాజీకి, అసామాన్య సేవాత్యాగాలతో కాంగ్రెస్‌ను బలపరచి, స్వాతంత్ర్యానికి తోడ్పడిన అసంఖ్యాక స్త్రీ పురుషులకు, నాయకులకు, వలంటీర్లకు మనందరితరపున నా నమస్సులు.

గత మన సమావేశానంతరం మనలను విడచి స్వర్గస్తులైన అగ్రగణ్యులకు మన మిత్రులకుటుంబాలకు మన హృదయ పూర్వకమైన సానుభూతిని అందజేస్తున్నాం

బీహార్, పశ్చిమబెంగాల్, అస్సాం, ఉత్తరప్రదేశ్ లలోని కొన్ని ప్రాంతాలలో మన సోదరులువిపరీతమైన వరదల బాధకు గురి అయ్యారు. వేలాదిమంది నివాసాలను కోల్పోయారు. బహుసంఖ్యాకులు చనిపోయినారు. ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్రప్రభుత్వం బాధితులకు పూర్తిగా సహాయపడినవి. యావద్భారతజాతి, ధన, పరికర సహాయాల నందజేశారు.

అంతర్జాతీయరంగం : (కొరియా)

ళ్యాణి మహాసభ సమాప్తమైనప్పుడు జనరల్ తిమ్మయ్య అధ్యక్షతక్రింద తటస్థరాజ్యాల సామరస్య సంఘం పని తు ఘట్టానికొచ్చింది. నిర్ణయకాలపరిమితి పూర్తికావటంవల్ల వెయ్యి వమంది యుద్ధఖైదీలను తమ భవితవ్యానికి

సంబంధించిన రాజకీయ సమస్యల పరిష్కారం గురించి ప్రశ్నించ కుండానే కమిషన్ తనపనిని కొద్దిరోజుల్లోనే ముగించవలసిన పరిస్థితి ఏర్పడింది.

భారతదేశం, తదితర ఆసియాదేశాలు భయాందోళనతో వెలిబుచ్చుచున్న వ్యతిరేకతను లక్ష్యచేయక పాకిస్తాన్‌కు ఆయుధసహాయం చెయ్యాలనే అమెరికా పాలకవర్గపు తలంపు రూపొందుతున్నది.

దూరప్రాచ్య, ఆగ్నేయాసియా రాజకీయ సమస్యలు, జర్మనీ ఆయుధ పునరుద్ధారణ సమస్యలు మనలను తీవ్రంగా కలవరపరుస్తున్నవి. ఇండోచైనాలో రాయబారాలద్వారా యుద్ధవిరమణ జరిగినప్పటికీ చాలక్లిష్టసమస్యలు అపరిష్కృతంగానే నిలిచిపోయినవి. అందులో కొన్ని అప్పుడప్పుడు తీవ్రరూపం దాల్చినా అదృష్టవశాత్తు ప్రపంచశాంతి సూత్రాన్ని ఛేదించేటంత విషమఘట్టానికి రాలేదు. కాని వీనికి తోడు ఆగ్నేయాసియాలోని బలహీన దేశాలకు రక్షణపేరుతో మనీలా ఒడంబడిక, పశ్చిమజర్మనీ పునరాయుధీకరణ అనేమరి రెండు సమస్యలు యేర్పడినవి.

ప్రపంచ జాతుల కుటుంబంలో సభ్యులుగనున్న మన పైన కూడ, యీ సంఘర్షణయొక్క తీవ్రత ప్రభావము పడకుండ వుండదు అందువలన మనచుట్టు రూపొందే పరిస్థితులకు మనము కళ్ళు మూసుకొనుటకు వీలుపడదు. శాంతి అవిభాజ్యం. ప్రపంచంలో యే మూల శాంతికి భంగమైనా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో యావత్తు మానవజాతి దానిఫలితాల ననుభవించక తప్పదని గత రెండు ప్రపంచయుద్ధాల అను

భంవల్ల నేర్చుకున్నాం. ఈ యుద్ధవాతావరణం తాత్కాలికంగా మానవపురోభివృద్ధిని ఆటంకపరుస్తుంది. పరమాణు ఆయుధ పరిశోధన మూలంగా పరిస్థితి మరింత క్లిష్టతరమైనది. దీనివలన జాత్యాభివృద్ధి కార్యక్రమము తాత్కాలికంగా ఆగిపోవుటయేగాక, యికపైన మానవవిజ్ఞానం సర్వనాశనంకావడమే దీనిఫలితము.

ప్రపంచంలోని ఏ దేశము, ప్రత్యేకంగా ప్రపంచ జనాభాలో ఆరవవంతు గలిగి జాతి పురోగమనానికి, కావలసిన అభివృద్ధి కార్యక్రమాలు నిర్వహించవలసిన భాధ్యతాయుత భారతదేశం ప్రపంచ వ్యవహారాలలో తనకర్తవ్యాన్ని ఉపేక్షించ లేదు.

భారత వైదేశిక నీతి:

అందువలన అంతర్జాతీయ సమస్యల పరిష్కారానికి మనము తగిన శ్రద్ధతో కృషి సల్పవలసివచ్చింది. అయినప్పటికీ మనమె . దూన్యాయనిర్ణేతగానూ, పాక్షికంగానూ వ వహరించ లేదు. స మైన మార్గముద్వారా సంప్రదింపులదా రా, పరిష్కా-రాన్వే ణకు సహకరించడమే మనపాత్ర. అంద కంటెను మనకే అంతర్జాతీయ సమస్యలో అధికంగా తెలియుననే అహంభావత్వముతోగాని, అన్యులను కించపరచాలనిగాని మనపాత్ర నిర్వహించబడడములేదు. ఏ కూటానికీ సంబంధించని మన పా త్రకు మనలో జీర్ణించియున్న, జీవితానికి సంబంధించిన మన ్రాతన భారతసంస్కృతే కారణము. హింసాయుత చర్యల దుష్ఫలితాలను ప్రత్యానుభవాలనుంచి నేర్చుకొన్నాము. పూజ్యగాంధీమహాత్ముని బోధలద్వారా హింసను మొదర్కో-షే మెలాగో గ్రహించాము. ఏ కూటానికి చెందని మన విధా

సం అతిశక్తివంతమైనది. ఇరుకక్షుల్లో దేనితోనూ చేతులు కలపకుండుటవలన శాంతియుత పరిష్కారానికి సాయపడగల ప్రయత్నాలన్నిటిలో సహకరిస్తున్నాము. అవసరమైనప్పుడు మనమే ముందుకువచ్చి సక్రమమార్గాన్ని నడుస్తున్నాము. అతి క్లిష్టపరిస్థితి నివారణకు మనవిధానమెంతో సహాయకారికాగల దని అనేకసారులు ఋజువైనది. రానురాను యెక్కువ దేశాలు నిర్మాణాత్మకదృక్పధమే సక్రమమైనదని గుర్తించుచున్నవి. అగ్రరాజ్యాలుకూడ పంచశీల బద్ధమైన శాంతియుత సహజీవ నాన్ని గురించి మాట్లాడ మొదలుపెట్టినవి.

ఇందువలన ప్రపంచశాంతిస్థాపనకు దోహదముచేసి, భారతదేశ ప్రతిష్టను అధికముచేసినట్టి విధానాన్నవలంబించిన భారత ప్రభుత్వానికభినందనాలు. భారతప్రభుత్వం ముందు సాగించే యీ విధానానికి మన సంపూర్ణ సహకారం ఉంటుం దని నిశ్చయించుకొనవచ్చును. మిత్రరాజ్యసమితి, కొరియా, ఇండోచైనాలలో ప్రపంచశాంతిసాధనకు మన ప్రతినిధులు సల్పిన మహత్తరకృషి మనం న్యాయమార్గావలంబకులమనే ఖ్యాతిని, ప్రపంచశాంతి ప్రియ ప్రజానీకముయొక్క సద్భా వాన్ని సమకూర్చింది.

వీటన్నిటికంటెను మనప్రేమపాత్రులు, ప్రధానామా త్యులు పండిట్ నెహ్రూజీ మనకృతజ్ఞతకు పాత్రులు. నిశ్శంకో చంగా వారే యీ వైదేశిక విధాన సృష్టికర్తలు. శాంతి స్థాప నకు వారి కృషి అమూల్యము.

**ఇండియాలోని విదేశ స్థావరాలు :**

ఒకవ్రక్క ఫ్రెంచిస్థావరాల విలీనీకరణ సంతోషదాయ

కము, మరొకపత్రిక బుడతకీచులు కొన్ని స్థావరాలను మొండి తనంగా పట్టుకొని నెట్టుకడం విచారకరము. విలీనీకరణోద్యమ సమరాన్ని సాగిస్తున్న మన సోదరీ, సోదరులకు మనసానుభూతి, నైతికసహాకార మెల్లపు డుంటాయని హామీ యిస్తున్నాము. పోర్చుగీస్ సంస్కృతికి మనం అపకారం తలపెట్టము, కాని ఆ స్థావరాల ప్రజాస్వాతంత్ర్యమంటే భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యము విదేశస్థావరాలతో సహా అన్నిప్రాంతాలకు వర్తించవలసినదే. మన వైదేశిక విధానానికి నా ఆనందముచెప్ప నలవిగాను. ఏది మన స్వాతంత్ర్యసమరానికి కారణమో, ఆ సంస్కృతీ సాంప్రదాయమే, యీవిధానానికి పునాది. ఎందు కంటే మనది ప్రత్యేకమైన, విశిష్టమైన, అపూర్వ, అద్వితీయ విధానం. సత్యాహింసలు ప్రాతిపదికగా పరమలక్ష్యమైన మన సంఘవ్యవస్థలో నిబిడీకృతమైన సిద్ధాంతమే దీని పునాదిబలం.

గాంధీజీ మననుండి విడిపోయినప్పటికీ యీ విధానముతోనే మన సిద్ధాంతాలను, కార్యక్రమాన్ని రూపొందిస్తుచున్నాం. స్వాతంత్ర్య సాధనవరకే మనమెన్నడు దానిను యోగించాలని భావించలేదు. ఆయ నాశించిన మేరకు ఆయన ప్రబోధనలు మనకున్న పరిమితుల్లో అనుసరించలేక పోవచ్చును. ఆయన విధానం భక్తి విశ్వాసాలతో అనుసస్తున్నా మనుకొన్నా, అనుద్దేశ పూర్వకంగా ఆయన నిర్దేశిం మార్గాన్ని వీడి యుండవచ్చును, కాని మన అభిప్రాయము, మన గమ్యము యెప్పుడూ మారలేదు, మారబోదు.

నాయకుల దూరదృష్టి:

ఈ సందర్భంలో స్వాతంత్ర్యం సంపాదించిన వెంటనే

మన స్వతంత్ర ప్రభుత్వం కాంగ్రెస్ సంస్థ అనేక విషమ సమస్యలను యెదుర్కొని బయట పడుతున్నందులకు అభినందనలు. దుస్సహమైన బాధ్యతలు మనపై బడినవి. సంస్థానాధీశుల విషయంలో ఏమాత్రం ప్రమత్తులమై చిన్నాభిన్నమై గజిబిజగ ఉన్నా కేంద్రాధికార శూన్యమైన బహుస్తాన్‌లు వెలసివుండేవి. ఆహారవిషయంలో యేమాత్రం ప్రమత్తులమైనా యాభై రెట్లో, నూరు రెట్లో బెంగాలు కరువులు ప్రత్యక్షమై దేశమంతా దుఃఖమయమై వుండేది. కాందిశీక సమస్య నేమాత్ర మలక్ష్యం చేసినా దేశాని కిదే దుస్థితి సంభవించి యుండేది. మన నాయకుల దూరదృష్టి, రాజకీయ దక్షత, నిర్మాణశక్తి, ధైర్యము, పార్టీ ఐక్యత, వారి మానవాతీత కృషి లేని పక్షంలో యీ సమస్యలు యింత సౌమ్యంగా, యింతత్వరలో పరిష్కార మయ్యేవి గాదు.

ఇదేమాదిరి మనం స్వాతంత్ర్యం పొందిన దశలో, దేశపు లోటుఆర్థికస్థితిని మనం మర్చిపోకూడదు. అన్నిశాఖల్లోను అసమగ్ర ఆర్థికపరిస్థితి ప్రతిబింబిస్తుంది. శతాబ్దాల తరబడి భూసారాభివృద్ధికి యెట్టి చర్యలు తీసుకొనబడనందున భూమి పూర్తిగా నిస్సారమై పోయింది. మూడింట రెండు వంతుల దేశంలో భూతత్వ, ఖనిజసంపద పరిశోధన జరుపబడలేదు. సముద్ర సంపదను గురించి విచారించనే లేదు. విచక్షణలేకుండ అటవీసంపద దోచుకొనబడ్డవి. పల్లెటూళ్ళలోని శ్రామికుల ఉత్పత్తి, కళాభివృద్ధికి ఎట్టి చర్యలు తీసుకొనబడక నిర్లక్ష్యం చేయబడ్డవి. నిర్మాణమైన యే కొద్ది భాగాల్లోనో

మినహా మిగిలిన దేశమంతా 19 వ శతాబ్దారంభంలో మాదిరి ప్రాథమిక దశలోనే ఉండిపోయినది. నిర్మాణమైన భాగాల్లో కూడ, వుత్పత్తి సామాగ్రి వుపయోగించ నందున దుస్థితిలోనున్నవి. రవాణా రహదార్లు సామ్రాజ్య పరిరక్షణకే నిర్మించబడి వుపయోగించ బడుచున్నవి. మన విద్యా విధానం గుమస్తాల వుత్పత్తికే నిర్దేశించబడినది. దేశం మొత్తంలో ప్రజారోగ్య సంస్థాపనలు లేవు. ఉన్న కొద్దివాటిల్లో కూడ అంతాలోటే. ఏ సంస్థనైనా, నాయకత్వాన్నైనా, యీలోట్లు, భారాలు, ప్రతిబంధకాలు, మన అభివృద్ధి లేమి నాశనం చేయగలవు. మన సంస్థగాని, మన నాయకత్వం గాని, నిర్వీర్యత, నిరాశ, నిస్పృహకు ఎట్టి పరిస్థితుల్లోనూ తావివ్వనందుకు మనం గర్విస్తున్నాం. మన నాయకత్వంపైన సంపూర్ణ విశ్వాసంతో యింతటి అతిక్లిష్ట పరిస్థితుల నెదుర్కొన్న మనప్రజానీకాన్ని చూచికూడ మనం గర్విస్తున్నాం.

క, సాంఘిక రంగాల్లో మినహా మిగిలిన సమస్యల్లో యిప్పటికి బయటపడ గలిగాము.

గత రెండు సంవత్సరాలనుండి, ప్రభుత్వ, కాంగ్రెస్ ర్వహణ బాధ్యతలు ఒకే పర్యాయము యీ మార్పుదశలో, వెనుకబడ్డ యీ ఆర్థికవిధానంలో యెన్నో సమస్యలను యెదుర్కొంటూ నిర్వహించడము ఎంతకష్టమో మన మూహించుకొనగలం. వారిపట్ల మనభక్తి విశ్వాసాలను ప్రకటిస్తున్నాం. ప్రభుత్వ నిర్వహణలో వారి మార్గదర్శకత్వం, కాంగ్రెస్ రంగంలో వారి నాయకత్వం లేనిదే క్రమానుబద్ధమైన యీ పురోభివృద్ధి అసంభవమని మనము గ్రహిస్తున్నాం.

పంచవర్ష ప్రణాళిక:

ఇది పంచవర్ష ప్రణాళిక ప్రారంభమైన నాలుగవ సంవత్సరము. ప్రణాళికా సంఘం నెలకొల్పబడ్డ సమయంలో వ్యక్తి స్వాతంత్ర్యం లేని కేంద్రీకృత ఆర్ధికవిధానం మనపైన బలవంతంగా రుద్దబడుతుందేమో నని చాల మంది సందేహించారు మరికొందరు ప్రణాళిక కార్యక్రమం, ప్రజాస్వామ్యం రెండువిరుద్ధ కార్యక్రమాలు అమలుజరపడం అతికష్టమని భావించారు మూడున్నర సంవత్సరాలు ప్రణాళిక అమలు జరిపిన పద్ధతితో అటువంటి సందేహాలన్నీ మటుమాయమైపోయినవి. నిస్సందేహంగా ప్రణాళికాపద్ధతి అమలు పరచడమంటే ఒకవిధమైన కంట్రోళ్ళు అమలుపరచడ మన్నమాట నిజం. ఇంతగొప్ప ప్రమాణములో ప్రజాస్వామ్యపాలనలో అమలు జరపడం మనదే తొలిప్రయత్నం కావడం నిజం. ఇప్పటికైన అనుభవంరీత్యా యీ క్రిందివిషయాలు నేర్చుకొన్నాం: (1) బాధ్యతాయుత కేంద్ర పర్యవేక్షణక్రింద మాత్రమే దేశములోని సర్వశక్తులను సమీకరించి భారతదేశంలాంటి సువిశాల దేశంలో క్రమాభివృద్ధి పొందటం సాధ్యమౌతుంది; (2) ఇచ్చిపుచ్చుకొనే మనస్తత్వము నెలకొనని పక్షములో పరిపాలనలోగాని, ఆర్ధికరంగంలోగాని దేశవ్యాప్తంగా నిర్బంధరహితంగా సమగ్రప్రణాళిక నమలుజరిపి లక్ష్యసిద్ధి పొందవచ్చును; (3) ఈ స్వల్పకాలంలో మనం సాధించిన పురోభివృద్ధి వల్ల యికముందు దేశవ్యాప్తంగా ఆర్ధిక, సాంఘిక అభివృద్ధిని జయప్ర ంగా కొనసాగించగలమనే దృఢవిశ్వాస మేర్పడినది. ఇ ట మనం సమావేశమౌతున్న ఈ తరుణంలో

కూడ గ్రామీణులనుండి పైవరకు ప్రజాస్వామ్యాభివృద్ధికి సంబంధించి వారిద్వారానే వారి దేశాభివృద్ధికి కృషిచేయించుటకు వుద్దేశింపబడిన ద్వితీయ పంచవర్ష ప్రణాళికను మన ప్రభుత్వం తయారుచేస్తోంది.

1953-54 ప్రథమ పంచవర్ష ప్రణాళికాభివృద్ధి నివేదిక మీలో చాలమంది చదివేవుంటారు. అది చాల సమగ్రమైన నివేదిక. ఇతర విధంగా లభ్యమయ్యే దానివివరణలతో మిమ్మలను విసిగించదలచుకోలేదు. మొదటి మూడు సంవత్సరాలలోనే ఆహారధాన్యాల విషయంలో ప్రణాళికాలక్ష్యాన్నధిగమించింది. పత్తి, నూనెగింజల విషయంలోలక్ష్యసిద్ధిపొందింది. నీటిపారుదల, విద్యుచ్ఛక్తి, సరఫరా స్కీములు త్వరితాభివృద్ధి పొందినవి. దీని ఫలితంగా 26,00,000 యకరాలభూమి సేద్యంలోనికిరావడం, 4,50,000 కిలోవాట్లవిద్యుచ్ఛక్తి అదనోత్పత్తి కావడం జరిగింది. ఈ అభివృద్ధికార క్రమంలో మరొక ప్రధాన విషయం, కమ్యూనిటిప్రాజెక్టులద్వారాను, జాతీయవిస్తరణ కేంద్రాలద్వారాను, పల్లెపట్టుల ప్రత్యేకాభివృద్ధి కార్యక్రమం 84 700 గ్రామాలలో 5 కోట్ల 60 లక్షల ప్రజానీకానికి అమలుజరుపబడినది. దీ లక్ష్యం 1, 2 0, 0 0 0 గ్రామాల్లోని 7 కోట్ల 90 లక్షల ప్రజానీకానికి అమలుపరచబడాలి. దీనికివెచ్చించబడిన 6 కోట్ల 90 లక్షల్లో 3 కోట్ల 3 లక్షల ప్రజలవద్ద సేకరించబడడాన్నిబట్టి ప్రజాసహాకార మెంతయెక్కువగ యీ పణాళికాభివృద్ధికున్నదో తెలిసికొనవచ్చు. ఈ ప్రాజెక్టులు, కేంద్రాలు యెక్కువమందికి వృత్తులు కల్పించుటకు, అధికోత్పత్తి సహాకార కార్యక్రమాభివృద్ధికి

నిర్దేశించబడ్డవి. ఈ లక్ష్యపరిమితి యింతవరకే కాదు.

అభివృద్ధి కార్యక్రమనిర్వహణ కవసరమయిన సంకల్పాన్ని సృష్టించి, తమంతట సత్వర కార్యాచరణకుపూనుకొనే మనస్తత్వాన్ని ప్రజానీకంలో సృష్టించడమే దానిముఖ్యోద్దేశము.

భూసంస్కరణలు :

ఇండియాలోని అన్నిరాష్ట్రాలలో భూసంస్కరణలు ప్రవేశపెట్టడానికి తగుచర్యలు తీసుకొంటుంది. మధ్యదళారులను తొలగించడానికి, భూమిపరిమితులను నిర్ణయించడానికి, రైతుల రుణవిమోచనానికి, భూఖండాల నేకీకృతం చేయటానికి, చిన్న, పెద్ద నీటి సరఫరాస్కీములు అమలుజరపటానికి, విత్తనాలు, యెరువులపంపకానికి, అభివృద్ధిచెందిన నూతన వ్యవసాయపద్ధతులు ప్రవేశపెట్టటానికి పంటలరక్షణకు దేశవ్యాపితంగా తగుచర్యలు తీసికొనుటకు ప్రయత్నాలు జరుగుతున్నవి. పారిశ్రామిక రంగంలోకూడ తృప్తికరమైన అభివృద్ధికలిగింది.

ఇంతవరకు మనం అమలు జరిపింది ఆర్థికప్రణాళికకు సంబంధించిన కార్యక్రమం. మన కందుబాటులోవున్న సాధన సంపత్తులతో, యిప్పుడు మనకున్న లెఖ్ఖల ఆధారాన్ని బట్టి యీ పరిస్థితుల్లో యింతకంటె యెక్కువ సాధించడాని వీలులేదు.

మనముసేకరించిన లెఖ్ఖలను కొంతవరకు ఆధారము చేసికొని తక్షణావశ్యకమైన అభివృద్ధిని సాధించడం మన అదృష్టం. ఈ స్వల్పవ్యవధిలో మనకున్న అవకాశాలు, సాధన సంపత్తులను సమన్వయపరచగలగడంకూడ అదృష్టమే. ఇక

మనలక్ష్యం, సామాజికాభివృద్ధులమధ్య తేడా యేమంటే మన అవసరాలను బట్టిగాక, మనకు లభ్యమైన లెక్కల నాధారముజేసి కొనే ఆర్థిక ప్రణాళికను నిర్వహించాలి; సామాజికాభివృద్ధి ప్రణాళిక మన అవసరాల ప్రతిపాదికపైనే నిర్ణయించబడుతుంది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక యిదే ప్రాతిపాదికపయిన రూపొందించబడుతుంది. ఆ మేరకు ద్వితీయ ప్రణాళికరోవాస్తవమైనది. ఆర్థిక, సాంఘికావసరాలను తీర్చడానికే యిది తోడ్పడగలదు.

దేశాన్ని పీడిస్తున్న ముఖ్యసమస్యల్లో నిరుద్యోగ సమస్య ఒకటి. ఇది నూతన సమస్యగాదు. గతంనుండి వస్తున్నదే. భారతపౌరులు, స్త్రీ పురుషులకు సమానావకాశాలతో సంపూర్ణ జీవనోపాధిని కల్పించాలనే ప్రాతిపాదికపైనే ప్రభుత్వ విధానాల నమలుజరపాలనేగాని 30 వ రాజ్యాంగ నిబంధన యేదో అనుద్దేశ్యంగా, యాధాలాపంగా చేర్చబడలేదు. కేంద్రం రాష్ట్రప్రభుత్వాలు యీ సమస్యనుగురించి అప్రమత్తులై వున్న మన రాజకీయసంస్థ యీ సమస్యాపరిష్కార మార్గాల నన్వేషించకుండ తప్పించుకొ జాలదు.

ప్రపంచమంతటా సోషలిస్ట్ విధానంలోను, పెట్టుబడిదా విధానంలోను ఆర్థికాభివృద్ధికి బహుళ వ్యాప్తంగా వుత్పత్తి, పంపకపు సంస్థలను అభివృద్ధి పరుస్తున్నారు. పాశ్చాత్యదేశాల్లో సాంకేతికాభివృద్ధి, యాంత్రికాభివృద్ధి ప్రాధమిక, మధ్యదశల్లో యెక్కువమంది మనుష్యులకు పనికల్పించడం తగ్గించింది. మూడవ దశలో ఆ దేశాల్లో నిరుద్యోగ సమస్య లేకుండా పోయింది. ఇతర విధాల మనకంటె ఎక్కువ అవకా

శాలు కలిగి మనదేశంకంటె ఈదేశాలు ఒక శతాబ్దంముందునుండి పరిశ్రమల్ని ప్రారంభించినవిషయాన్ని గమనించాలి. భారతదేశాని కట్టి అవకాశాలు లేవు ఆ విధానాలనే యధాతధంగా అనుస రించలేము. అందువలన కమ్యూనిస్ట్ పెట్టుబడివిధానాలు మన సమస్యల పరిష్కారాని కుపకరించవు. దీనికి సమానమైన, బలీయమైన మరొక కారణంకూడా కలదు. మన జీవితదృక్ప థమే పూర్తిగ భిన్నమైనది. ఆర్థికావసరాలను అలక్ష్యం చెయ్యలేక పోయినప్పటికి, ప్రధానంగా మానవుని నైతిక పునా దులపైనే వున్నత సాంఘిక వ్యవస్థ నిర్మాణ మవుతుందని మన విశ్వాసం. ఆచరణరీత్యా ఆర్థిక, సాంఘిక పురోభివృద్ధికి కేవలం భౌతిక భావాలే ప్రధానంగాక, అన్యభావాలుకూడ సహాయ పడగలవు. ఈ ప్రత్యేక భాగమేగాక మరొక ఆచరణభాగం కూడ వున్నది. కేవలం అత్యధిక పెట్టుబడులతో లక్షలాది కొరతపనివారికి, నిరుద్యోగులకు పని కల్పించడముతో లక్ష్య సిద్ధికాదు. ఇందుకు పెట్టుబడి అవకాశాలలేమితోబాటు అనేక కారణాలున్నయ్.

కుటీర పరిశ్రమలు :

పైకారణాలవలన ప్లానింగ్ కమీషన్తోసహా భారతీయు లంతా తక్కువ పెట్టుబడులతో సాధ్యమయ్యే కుటీర, చిన్న పరిశ్రమలు దేశవ్యాప్తంగా పెంపొందించాలనికోరుతున్నారు. మన ఆర్థిక దుస్థితి నివారణ చిన్న పరిశ్రమలద్వారా సాధ్య మనే మన సహజ విశ్వాసాన్ని ప్రపంచం గుర్తించగలదు. కేంద్రీకరణ, వికేంద్రీకరణలకు గల భేదాలను గూర్చిన సిద్ధాంత వాదాన్ని తాత్కాలికంగా నైనా కట్టిపెట్టాలి.

తాత్కాలికంగా నన్న నా భావం ఈ విధానం ఫలితాలు పూర్తిగా తేలేవరకు కావలసిన కాలవ్యవధి ఇవ్వాలని. చిన్న, కుటీర పరిశ్రమల అభివృద్ధికి మనకున్న సర్వశక్తులను పూర్తిగ సమీకరించి మనం పురోగమించాలి.

కుటీర పరిశ్రమల, చిన్న పరిశ్రమల అభివృద్ధికి ఈ దిగువ చర్యలు తీసుకోవాలని సూచిస్తుంది; (1) ప్రజావసర సరఫరాల నిర్ణయం; (2) ఉత్పత్తి కేటాయింపులు; (2) చిన్న పరిశ్రమల అభివృద్ధి, పెద్ద పరిశ్రమల అభివృద్ధి కట్టుబాటు; (4) భారీ పరిశ్రమలపైన పన్ను విధింపు; (5) ముడిసరకుల సరఫరా; (6) పరిశోధన శిక్షణవగైరాలు భారీపరిశ్రమలకు సంబంధించినంతవరకు గృహ పరిశ్రమల పాత్రలో యేపక్షానికి యెట్టి సందేహాలు లేకుండా చెయ్యాలి. నిరుద్యోగ నివారణకు అత్యంత ప్రధాన స్థానమివ్వడమే గాక, గృహపరిశ్రమలకు కేటాయింపులలో భారీపరిశ్రమలకంటె ప్రధాన స్థానం యివ్వ బడుతుంది. ఈ సుస్పష్ట విధానం శ్రీ వినోభా వే నాయకత్వం క్రింద నిర్మాణాత్మక కృషి సల్పే మన మిత్రుల సందేహాలు తొలగించగలదని నేను విశ్వసిస్తున్నాను. భావశక్తితో సహా యితర సాంకేతిక సాధనాలను చిన్న పరిశ్రమల కుపయోగించ గూడదని యెవ్వరూ వాంఛించటం లేదు. మనకున్న సర్వశక్తు లను సమీకరించి గృహ పరిశ్రమాభివృద్ధి కోరేవారి బలాలను సమీకరించి కాంగ్రెస్ సంస్థ కృషి చేసిన పక్షంలో నిరుద్యోగ సమస్యను పూర్తిగ పరిష్కరించడమే గాక దేశం నలుమూలల పునర్నిర్మాణ భావాన్ని పదిసంవత్సరాలలో సృష్టించగలదు. ది దేశపురోభివృద్ధికి ఎంతైనా తోడ్పడుతుంది.

గృహ పరిశ్రామికాభివృద్ధి కార్యక్రమంరూపొందేవరకు భూసారరక్షణ, అడవుల పెంపకం, చిన్న, పెద్ద నీటిపారుదల, బావుల సేద్యములు, రోడ్ల నిర్మాణ కార్యక్రమాలతో ప్రజానీకానికిపనులుకల్పించబడాలి. దీనితోబాటు దేశంలోని ముఖ్య కీలకపరిశ్రమలు, అవసరమైన, సరుకులు లభ్యం గావడానికి అభివృద్ధి అయ్యేలాగున చూడాలి. సోషలిస్ట ఆర్థిక శ్రేయస్సు కొరకు;అత్యవసరజాతీయావసరాలకొరకు,కంట్రోళ్ళవిధింపుకు లోబడి దేశశ్రేయస్సుకు తోడ్పడేవిధంగా ప్రయివేటు పరిశ్రమాభివృద్ధి ప్రోత్సహించ బడాలి.

సామాజికలక్ష్యాలు :

తక్షణ నిరుద్యోగ నివారణ సమస్యలనుండి సాంఘిక విషయాలకు వచ్చాను. సాంఘిక ప్రజాస్వామ్యంలేని రాజకీయ ప్రజాస్వామ్యం నిరుపయోగమని అందరూ అంగీకరించిందే. సమిష్టికృషి, త్యాగాలు లేనిదే అభ్యుదయం సాధించలేమనేదికూడ అందరూ అంగీకరించినదే. మనమనుకొనేసాంఘిక ప్రజాస్వామ్యమంటే యేమిటి?సమిష్టిసేవా, త్యాగవాతావరణ మెలా సృష్టించడం ? గత 40 యేండ్లనుండి గాంధీజీ రాజకీయ రంగంలో ప్రవేశించినది లగాయతు భారతజాతీయ కాంగ్రెస్ సంస్థ అదే ప్రజాస్వామ్యవిధానాన్ని ఆచరణలో పెట్టుటకు కృషిచేసింది. అప్పటి పరిస్థితులవలన వారు ఆశించిన పరమావధులైన ఆర్థికసమానత్వం, సాంఘికసేవలను సాధించలేకపోయినారు. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత భారతరాజ్యాంగంలో యీ లక్ష్యావశ్యకతను మళ్ళీ నొక్కి వక్కాణించటం

కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు శాసనాలు, పన్నులవిధానాల ద్వారా పై లక్ష్యసిద్ధికి ప్రయత్నించినవి.

సంస్థానాలలినీకరణ, జమిందారీలరద్దు, యేస్టేటుసుంకం విధింపు, ఆదాయపు పన్నులసవరణలు, 'బి' రాష్ట్రాల ఆర్థిక సమన్వయ ఒప్పందం, రాజ్యాంగచట్టంలో 31 A ఆర్టికల్ సవరణ, యివన్నీ ఆర్థిక సమత్వాన్ని లక్షించినవే. భారత పౌరులందరికీ సమానావకాశాలు కలిగించనిదే వాస్తవ సమత్వము అసంభవమని కాంగ్రెస్‌వాదులమైన మనము ఖచ్చితంగా గ్రహించాలి. ధన, బుద్ధి, విజ్ఞానసంపన్నులైనవారి అంతస్తును తగ్గించాలని మనము కోరుటలేదు. కాని భూముల్లో, ఫ్యాక్టరీల్లో, కర్మాగారాల్లో పనిచేసే కార్మికులకుకూడ సమానాధిక్యత కలుగజెయ్యాలని కోరుతున్నాము. వారికి సమానావశాలు కల్పించబడనంతకాలం వారి అంతస్థు పెరుగదు. ఇప్పటి ఆర్థికవిధానంలో అందరికీ సమానావకాశాలు కల్పించబడగలవనుట సాధ్యమా ? ఈ విషయం జాతి పురోభివృద్ధికి ముఖ్యము. మన దేశాభివృద్ధికి ముఖ్యాధారం ప్రజాబలం. సమానాధిక్యత, అవకాశాలు కల్పించ గలిగితేనే కార్మికుడు తనశక్తికొలది తోడ్పడతాడు. కొంతకాలం వరకు అసమానత్వమున్నా మన అంతిమలక్ష్యం మానవునికి, మానవునికి వున్న అంతరభేదము నూతన సాంఘిక వ్యవస్థలో పరిమితం కావలెననే సంకల్పం మనలో పెంపొందాలి. వృత్తి కారణంగా అంతస్థులో హెచ్చుతగ్గు లుండకూడదు. ఏదైనా అలాంటిదున్నా కష్టజీవికి ప్రధాన గౌరవస్థానం లభించాలి.

ఆర్థిక అసమానత్వ సమస్య తరువాత పరిష్కరించ

వలసినది సాంఘిక అసమానత్వం. గత 30 సంవత్సరాలనుండి యీ విషయంలో మన దృక్పథంలోనెంతో మార్పు వచ్చింది. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత శాసనాల ద్వారా సాంఘిక విభేదాలు మూలాన్నే దెబ్బతీసినవి. భారతజాతీయతకు, సంకు చిత, కుల, మతతత్వాలకు పొత్తుకుదరదని గట్టిగనొక్కి నూరి పొయ్యాలి. మత,సాంస్కృతిక భావాలకు అపార్థాలు కలిపించు కొనుటవల్ల కులాభిమాన మేర్పడుతుంది. క్రమేణా యీ మూడూ భ్రష్టం గాకతప్పదు కులతత్వం, మతం, సంస్కృతి, సాంఘికసమత్వ సిద్ధాంతాలకు భిన్నమైనదై స్వకులాభిమానాన్నధికంచేస్తుంది. వ్యక్తి పరంగా అహంకారం, సంఘపరిమితులో వైరుధ్యం జాతి పరిమితుల్లో విభేదాలకు దారితీస్తుంది. ఏ భారతీయుడు సాంఘికవిభేదాలతో స్వతంత్రభారతదేశానికి గుదిబండగాను, భారతమాత పాదాలకు శృంఖలంగాను పరిణమించాలని కోరడంలేదు. మనలో ప్రతిఒక్కరం రాజకియ, సాంఘిక ప్రజాస్వామ్యాలు చేతులుకలిపి సమానంగా పురోగమించాలని ఆశిస్తున్నాం. అందువలన యీ కులతత్వభేదాలను పూర్తిగ నిర్మూలించడానికి కృతనిశ్చయులమై కృషి సల్పాలి. లేనియెడల దేశ ఐక్యతకు హానికరమైన మానసిక అంతర్భేదాలు సృష్టించబడగలవని మనకు తెలుసు. ఇదేవిధంగా సాంఘిక రాజకీయరంగాల్లోకూడా సంకుచిత స్థానికాభిమానాలకు వ్యతిరేకంగా కృషిచెయ్యాలి.

స్త్రీ జనోద్ధరణ :

స్త్రీల విషయంలో కూడా మనవైఖరి చాల మారింది. ఇటీవల ఆమోదించబడిన శాసనాలవలన చట్టసంబధమైన

చిక్కులు చాలభాగం తొలిగిపోయినవి. దేశములో మహిళా సంఘా లుద్భవించి సాంఘిక సంక్షేమ కార్యక్రమాల్లో సముచిత స్థానాల నాక్రమించి పనిచెయ్యడం ముదావహం. దేశం నలుమూలాలలను, భారతదేశంలో ప్రతిగృహానికియీ స్వాతంత్ర్య సందేశాన్ని దృఢనిశ్చయంతో వ్యాపింపజెయ్యాలి. సగభాగమైన అస్వతంత్ర మహిళల సర్వశక్తులను భారత పురోభివృద్ధికి వినియోగ పడేలాగున ప్రయత్నించాలి. స్త్రీ జానానికి సంపూర్ణ గౌరవాదరణలు, సమానఆర్థిక స్వాతంత్ర్యాం కలుగజేయని యెడల ఆరోగ్యవంతమై, రాణించగల సమాజ నిర్మాణ మసంభవం.

మనలో అధికసంఖ్యాకులైన వెనుకబడ్డ జాతులవారి విషయంలో వారి అభివృద్ధికి విద్యావకాశాలు కలుగజేయుట మొదలైన సమస్త చర్యలు మన ప్రభుత్వం తీసికొంటుంది. మన సంస్థకూడ యీ కార్యక్రమంలో శ్రద్ధతోతోడ్పడుతున్నందుకు నేను సంతసిస్తున్నాను. శతాబ్దాల తరబడి వీరిపట్ల చూపిన అలక్ష్యాల కిప్పుడు మనం పూర్తిగ సహకరించాలి. ప్రభుత్వ సహాయని కెదురు చూడనివారిపట్ల శ్రద్ధవహించి సాధ్యమైన మేరకు, సర్వవిధాల సహకరిస్తే వీరైనంత త్వరలో మంచి పురోభివృద్ధి పొందగలరు.

విద్యా సమస్య కొద్దాం. మనమాశించే నూతనసమాజాభివృద్ధికి, వర్గవిభేదాలనుతొలగించడానికి, కాయకష్టపు హోదా గు_ ంచడానికి, సహకారవిధానాన్నర్థం చేసికొనడానికి, సేవా తా గాలను గుర్తించడాని కనువగు విద్యావిధానం మనకుండా ని అందరం అంగీకరిస్తున్నాం. ఈ విధానానికి బదులు

ప్రాథమిక విద్యావిధానం ఉండాలని మనమంతా అంగీకరిస్తున్నాం. ఈ విధానాన్ని తక్షణం ప్రవేశపెట్టాలి. ఇక దీని విషయంలో తర్జన భర్జన లవసరం లేదనుకొంటాను ఏమాత్రపు జాతీయశక్తినీ వ్యయపరచకుండ మన ముపలక్షించే సాంఘిక వ్యవస్థ మార్పు కనువగు విద్యావిధానం అమలు జరుపబడాలి. మనమాశించే నవసమాజ వ్యవస్థకు తక్షణం పునాదులు నిర్మించాలి. భారతదేశం తన గమ్యస్థానాన్ని చేరుకొనే ప్రయత్నంలో మొదటి మైలురాయివరకు చేరగలిగింది. చాల దూరంవరకు ప్రయాణించ గలిగాం. నూతన విశాలమార్గాన్ని నిర్మించుకొన్నాం. దాని విలువైన ప్రభావం మన కాంగ్రెస్ సంస్థపైనకూడ ప్రసరించక తప్పదు. దేశం పరిమితి మార్పుతో పాటు బాధ్యతలు కూడ పెరిగినవి. ప్రధాన సంస్థ అయివుండి వచ్చిన మార్పులను, నూతన బాధ్యతలను కాంగ్రెస్ గమనించకుండా వుండలేదు.

సుస్థిర ప్రభుత్వావశ్యకత :

స్వతంత్రం సిద్ధించినతరువాత మన ప్రథమ బాధ్యత సుస్థిరప్రభుత్వాన్ని నెలకొల్పడం. అందువలన కాంగ్రెస్ పరిపాలనలో పాత్ర తీసుకొనక తప్పదు. ఇంతపెద్దసమస్య మంచి చెడ్డలప్రభావము కాంగ్రెస్ సంస్థపైన పడితీరుతుంది. కొన్నింటి వల్ల సంస్థహోదా పెరిగింది. మరికొన్నింటివలన సంస్థ ప్రతిష్టకు దెబ్బతగిలింది. సహజపరిణామంలో యిదితప్పనిసరి. దీనిని మనం సాహసంతో యెదుర్కోవడ మవసరం.

స్వాతంత్ర్యానికి పూర్వం కాంగ్రెస్ సభ్యులుగ యెవరైనా చేరడానికవకాశం కల్పించబడ్డది. కాని అప్పటిపరిస్థితుల్లో

అత్యధిక భాగం కాంగ్రెస్‌లో చేరలేదు. కాంగ్రెస్‌లో చేరక పోయినా అధిక సంఖ్యాకుల సానుభూతి, సహకారాలను ధారాళంగా పొందగల్గింది. అట్టివారికీనాడు ప్రవేశాటంకం కలుగ జేయజాలం. స్వాతంత్ర్యానంతరం కాంగ్రెస్ సభ్యత్వం సహజంగా పెరిగింది. కాంగ్రెస్‌లో చేరినవారిలో అధిక సంఖ్యాకులు ఉత్సాహంతో చేరారు. కొందరు తమ కర్తవ్యాన్ని గుర్తించి చేరారు. మరికొందరు కేవలం స్వార్థదృక్పథంతో ప్రవేశించారు. పూర్వపరిస్థితుల్లో శాసనసభా సభ్యత్వాలకు ప్రత్యేకగౌరవ, ప్రతిపత్తులు కట్టిపెట్టబడినవి. కాంగ్రెస్ పార్లమెంటరీ కార్యక్రమంలో పాల్గొనడం వలన స్వాభిమానాలు, పోటీలు, వైరుధ్యాలు తప్పక పెంపొందించబడుతవి. కాంగ్రెస్ ప్రభుత్వాలను యేర్పాటుచేయవలసివచ్చింది. ప్రజాస్వామ్య ప్రభుత్వంలో అనేక విధాల బాధ్యతలు నిర్వహించాలి. అంటే అన్నిరకాల పదవులను చేపట్టడం. దీనివలన కూడా మంచి చెడ్డ ఫలితాలు కలుగుతాయ్.

లోగడ కాంగ్రెస్ వాదులు నిర్వహించిన సాంఘిక నిర్మాణ కృషిలో చాలభాగం ప్రభుత్వబోర్డులు, సంస్థలు, కాంగ్రెస్ తదితర సంఘాలు, నిర్వహణక్రిందికి వచ్చినవి. కాంగ్రెస్‌సంస్థ క్రమేపీ రానురాను ఒకపార్లమెంటరీ పార్టీ క్రింద తయారై ప్రధానంగా విధానాలను నిర్ణయించడం, ఎన్నికలు జరుపడం, ప్రభుత్వాన్నో లేక పక్షాన్నో నడపడానికే పరిమితమవుతుందనే సందేహం కొంతమందికి కలుగుతుంది. అందువలన మనసంస్థ నిర్వహణ, తదితర కొన్ని అంశాలను గురించి ఖచ్చితంగా చెప్పవలసి వచ్చింది.

కాంగ్రెస్ అంటే యేమిటి? పరతంత్ర మానవకోటి హృదయవేదన వ్యధాపూరిత హృదయంనుండి ఆవిర్భవించి వెలువడిన కన్నీటిబొట్టు: కొన్ని బలహీనతలవలన మనజాతి విదేశీయుల కుయుక్తుల దోపిడీవిధానానికి బలయినది. ఉక్కు సంకెళ్ళ బంధవిముక్తి కెంత శీఘ్రంగా ప్రయత్నించిందో కాంగ్రెస్‌కు అంత వేగంగా, దృఢంగా, శారీరక బాధలు, మానసికాందోళన అధికమై ఇకపై నెంతమాత్రం దైహికంగా, మానసికంగా భరించలేనంత బిగువుగా బంధించబడ్డది. ఆ కన్నీటిచుక్కలు కాలువ్వై, ఆకాలువ ప్రవాహమై, ఆప్రవాహం గంగా బ్రహ్మపుత్రానదులై తరాల తరబడి పేరుకొని పోయిన పాపాలు, బలహీనతలుఆప్రవాహాల్లో ప్రక్షాళనంచేసి, భారతజాతి నేకముజేసి, వారి హృదయాలకు నూతనోత్సాహ, వికాసాలను కలుగజేసి పవిత్ర ఐక్యతతో వారిప్రియమైన గమ్యస్థానాన్ని చేరుకొనుటకు వారిని సిద్ధసంకల్పులను చేసింది. ప్రపంచ చరిత్రలో యిదొక అద్వితీయ మహాశక్తిగా పరిణమించింది. యావత్ప్రపంచం విని ఆచరించేలాగున, యీ నిర్మల, నిరాయుధ సైన్యాలు నలుమూలలు యీ మహత్తర సందేశాన్ని వ్యాపింపజేశారు. ఇట్టి సందేశాన్ని యెప్పుడో చాల అరుదుగాగాని వినియుండలేదు. భయాన్ని పోద్రోలి అచంచల ధైర్యవిశ్వాసాలతో సత్యంకొరకు ప్రేమా, హింసలనే ఆయుధాలతో పోరాటాలు సాగించేలాగున చేయడమనేదే యీ సందేశం. అంతిమవిజయాన్ని ప్రేమా, హింసలతో పొందవచ్చునే అమేయ ప్రేమ శక్తిలో విశ్వాసమే దీని పర్యవసానం.

మన మసమాన త్యాగం చెయ్యవలసి వచ్చినట్లు

బాహ్యదృష్టికి గోచరిస్తుంది. కాని వాస్తవాని కది మిగిలిన వాటికంటె యెంతో సులభమైన పోరాటం. మన పోరాటం నిరాయుధమైనందు వలన ప్రత్యర్థి సైనిక బలాన్నధిగమించ గలిగింది. ఇది బహిరంగ వుద్యమం కావడంవల్ల కుట్రలను, మాయోపాయాలను భగ్నం చేసింది. ధర్మ సమ్మతమైనందున శత్రువు నైతికశక్తిని పటాపంచలు చేసింది. దీని సైన్యము, ప్రత్యర్థి కుతంత్ర సైన్యాన్ని, కుట్రలను, నైతిక బలాన్ని విఛిన్నం చేయడం వలన పూర్తిగ దెబ్బతినడం జరిగింది. అయినా వారు కొన్నాళ్ళపాటు మనగలిగారంటే వాటిబలం చేత గాక, మన బలహీనతవలన, అసమగ్ర సన్నాహంవల్లనే, ప్రత్యర్థిపై నింతగ పనిజేసిన దీని ప్రభావం మనపై నెలా ప్రసరించింది? ఇదేమనకు యీనాడు ప్రధానం. ఇంద్రజాలంవలె అనూహ్యంగా మన హృదయాల్లో నవజీవం ప్రవహించింది, మన నాడుల్లో నూతనరక్తం ప్రసరించింది, నూతనశక్తి మన మనస్సుల నావరించింది, మనఅంతరాళాల్లో నవవికాస వెల్లివిరిసింది. దీని ప్రభావం వ్యక్తుల అంతస్థునుబట్టి కొద్దిపాటి తేడావున్నప్పటికీ నవ్యవికాస, నూతనోత్తేజంతో మనలను అతి సులభంగా వశపరచుకొన్నది. పాత అలవాట్లను మరిచిపోయి పవిత్ర ప్రవాహంలో ముందుకు కొంపోబడ్డాము నెలలు, సంవత్సరాలు, దశాబ్దాలు గడచినా దైనందినం నిత్య నూతనంగా భావిస్తున్నాం. కొన్ని సందర్భాలలో మన మలపట చెంది ప్రపంచం మన ముందించిన వసతులు, గత సుఖ జీవితాన్ని తలపోసు కొంటుంటాం; కాని యీ భావం క్షణికం మాత్రమే. ఉద్యమ సందేశం మనలో బలీయమైన, అతిశక్తి

వంతమైన, నిర్విరోధమైన ఆకాంక్షను సృష్టించింది. ఒకరకంగా అది మనలను పరీక్షలకు గురిచేసింది. అట్టి పరీక్షను కాంగ్రెస్ వాదులం ఎల్లప్పుడు ఆహ్వానిస్తాం, దాని ఫలితం నిశ్చయం. అంతః ప్రబోధబలంతో అనుదిన మభివృద్ధి చెంది ఆత్మశక్తి దినదిన ప్రవర్ధమానమైంది. గాంధీజీ సందేశ మీ విషయంలో సుస్పష్టంగానే వుంది. ఆత్మశక్తి పెంపొందించుకొనడంపైనే మన విముక్తి ఆధారపడివుంది. అదొక ఆత్మసాక్షాత్కార పద్ధతి వంటిది. అది స్వవిముక్తికి జరిపే పోరాటం. ఆ శక్తిని పొందగలిగిననాడు మన స్వాతంత్ర్యాభివృద్ధుల గమ్యసాధనలో ప్రపంచములో యే శక్తి మనలను అడ్డలేదు.

ఈ సందేశం కేవలంరాజకీయవిముక్తికీ, కేవలంబాహ్యాగోచరమైన ఆర్థిక, సామాజిక మార్పులకే పరిమితంకాదు. అది మానవుని మానసికంగాసర్వస్వాన్నిసంపూర్ణంగా మార్చివేయడానికే వుద్దేశించబడ్డది. నూతన సాంఘికాభివృద్ధికీ, మన సమాజవ్యవస్థకూ అట్టిమార్పేబలమైన పునాది కాదగింది.

ఇది ఆచరణలో చాలకష్టంగా కనుపిస్తున్నది. కాని చిత్తశుద్ధితో, విశ్వాసంతో ఆచరించినప్పుడల్లా యెంతో సులభంగా కనుపించింది. ఇది మనలను, మన విదేశపాలకులను సంస్థానాధీశులను మార్చివేసింది. మార్పుతప్పనిసరి అనేవిషయం గుర్తింపజేసే సున్నిత వాతావరణం సృష్టించింది.

ఈసందేశం ప్రధానంగా భారతీయులకే యివ్వబడినా, ప్రపంచానికంతటికీ ప్రయోగకరమైనదే. పరాధీన ప్రజలకు పూర్వం, యిప్పుడుకూడ యిదే ఆశాజ్యోతి. అహింసాత్మక

జీవనానికి దొరకలేటే న్యాయ, ధర్మ ఆయుధమని అనేక పర యాలు ఋజువుచేయబడింది. అణగద్రొక్కబడి దోపిడీకి గురైనవారి అంబులపొదిలో ధర్మరక్షణాయుధమిదొక్కటే. ఈ సందేశం నూతనమైందికాదు. ఏసుక్రీస్తు, మహమ్మద్, జురాస్టరు, బుద్ధభగవానుడు, కన్ఫ్యూషియస్ మొదలైనవారంతా యిదే సందేశాన్నిచ్చారు. ప్రపంచపరిస్థితుల్లో తేడానుబట్టి ప్రయోగంలో కొంతవరకు మార్పులు కలిగినవి.

మహాత్ముని సేవ :

ఈ సందేశస్రష్టికర్తలైన మహాత్మాజీ జీవితచరిత్ర భారతదేశంలోని పసిపిల్లలకందరికీకూడ తెలియును. ఈ సందర్భంలో నేనొకవిషయాన్ని ఖచ్చితంగా చెప్పదలచాను. ఈ సందేశకర్తమహాత్మాజీ గొప్పవిద్వాంసుడుగాడు, కనీసం విద్వాంసుడుకాడు, వేదాంతికాడు. రాజకీయ చతురుడుగాడు. సామాన్యమధ్యతరగతి కుటుంబంలో జన్మించాడు. తనఅభిప్రాయాల్లో తన అచంచలవిశ్వాసమే తనకున్నఆస్తి. సాధారణ స్త్రీ పురుషులపైన అతిశక్తివంతమైన దాని ప్రభావపరిణామం గమనిస్తే అది దైవికచర్యగ తోచకమానదు. మహాత్ముని దివ్యప్రబోధం ఆశాపాశాలకు, అసత్యాలకు లొంగక తద్వ్యతిరేకతలను సహితం కరిగించగలిగినంత శక్తివంతమైన ఆత్మశక్తిని పెంపొందించింది.

మహాత్ముడొక ఆదర్శవాదికాడు. గుజరాత్ రాష్ట్రంలో వా పారీలని పేరుబడిన వంశంలో జన్మించాడు. తనకీప్రపంచ వ్యవహారాలతో సంబంధంలేదని తప్పించుకుతిరిగేవాడు గాని, వష్టించుకొనకుండా ముక్కుమూసుకొని కూర్చునేవాడుగాని

కాదు. ప్రపంచంతో అత్యంత సంబంధంగల విషయాచరణ విషయంలో సంపూర్ణ విశ్వాసం కలవాడు. ఆయన బోధలు ఆధ్యాత్మిక సమస్యలకు, ప్రపంచ సమస్యలకు సమాన ప్రయోగార్హములు. ఆయన సిద్ధాంతం నిరాశ, సందేహాలమయం గాదు. నిర్మాణాత్మకమైన చైతన్యస్రవంతి. సర్వవిధాల నిరాశ జెందిన ప్రజానీకాన్ని సమీకరింపచేయగలిగింది. పునర్జీవిత ఆశలతో ద్విగుణీకృతశక్తితో కార్యోన్ముఖుణ్ణచేయగలిగింది. ఆయన సిద్ధాంతం దేశరాజకీయ స్వాతంత్ర్యానికే పరిమితం గాదు. ఆర్థిక, సామాజిక, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యాలనుకూడ యిముడ్చుకొంది. ఆయన వుద్దేశించినలక్ష్యం ప్రజాస్వామ్య మన్నారు. అయితే ఆయన ప్రజాస్వామ్యం అత్యధిక సంఖ్యాకుల అత్యధిక శ్రేయస్సుకేగాక, సర్వమానవజాతికివర్తించేది. మానవుని సహేతుకావసరాలు తీర్చనిదే యే సంఘము శాంత్యాభివృద్ధులు పొందలేదు. భారతావని పారతంత్ర్యబంధనలో వున్నప్పుడు, దాస్యవిముక్తికి పోరుసల్పే దినాల్లో సంఘములోని కట్టకడపటి వ్యక్తి వుద్ధరించబడాలనే ఆశయంనుంచి ప్రతిభానంతమైన ఆయన నిర్మాణ కార్యక్రమం ద్వారా గాంధీజీ దీనజనోద్ధరణ కార్యక్రమం ఆచరించారు. ఖద్దరు, అస్పృశ్యతా నివారణ, తదితర నిర్మాణకార్యక్రమం యీ ఆశయంతో ఆచరించినవే. విశుద్ధసాధనావలంబనవల్లనే విశుద్ధలక్ష్య సిద్ధించగలదు. తనకత్యంతప్రియమైన సత్యాహింస సిద్ధాంతాలను స్వాతంత్ర్య సంపాదనకు విడనాడవలసి వచ్చినచో ఆయనట్టి స్వాతంత్ర్యాన్నెంతమాత్రము ఆకాంక్షించరు. ఆయనట్టి విస్పష్టసిద్ధాంతాల నమలుపరిచి, సేవ, త్యాగము, నిరాడంబర

ప్రజాసేవలతో విభిన్నవర్గాల మధ్య ఐక్యత సాధించి మార్గదర్శులై కాంగ్రెస్‌సంస్థద్వారా జయపరంపరలను సాధించారు. భారతజాతి పునరుజ్జీవనానికి తన కాత్స్న్యమైన కాంగ్రెస్‌ను సాధనగ వుపయోగించారు. రాజకీయాధికారం రాకతప్పదు. పూర్వంమాదిరి మన స్తత్వాలు పరిశుద్ధంగా వుండాలి. మన కధికారం యిప్పటిమాదిరి సంక్రమించవచ్చు. ఆ అధికార మెందుకుద్దేశించబడిందో దానికే వినమ్రత, సేవాపరత్వాలను వినియోగపరచాలి. ప్రభుత్వ బాధ్యతలకు వెలుపలవుండి, కాంగ్రెస్ సంస్థ ప్రజానీకముతోనె వుండి సేవా, త్యాగాలతో యెప్పటివలె తన విద్యుక్త ధర్మాన్ని దీక్షతో సాగించాలి. నైతిక బాధ్యతలు యేర్పడినందువలన కాంగ్రెస్ యెన్నికలలో పాత్ర తీసికోవలసినదే. కాని యెన్నికలు లక్ష్యానికి సాధన మాత్రమే. ప్రజాస్వామ్య పాత్రను గురించి, ప్రజాస్వామ్యంలో నిర్వహించబోయే వారి పాత్రను గురించి, యేవిధంగా ప్రజాస్వామ్యాన్ని బలపరచగలరో ప్రజానీకానికి బోధించడమే యెన్నికలలో కాంగ్రెస్‌వారి ముఖ్యోద్దేశం. కాంగ్రెస్‌కు యెన్నికలే ప్రధాన లక్ష్యం కాదని గుర్తించగలిగినప్పుడే అ నిర్మల వాతావరణ మేర్పడుతుంది. కాంగ్రెస్ ప్రజాసేవ ప్రబోధము దీక్షతో కొనసాగించినయెడల తత్ఫలితంగా యెన్నికల సమయంలో కాంగ్రెస్‌కు అత్యంత గౌరవం, పూర్తి స్థానము గాకపోయినా సముచిత స్థానం లభించగలదు.

ప్రభుత్వ యంత్రాంగ ప్రాముఖ్యాన్ని మనం తగ్గించుట లేదు. భారత ప్రజల క్రమాభివృద్ధికి తోడ్పడగల సుస్థి ప్రభుత్వం నెలకొల్పడం విషయంలో మన బాధ్యతను గ్రహి-

చాము. ఇన్నాళ్ల పోరాటాల్లో కంటే జాతీయ కాంగ్రెస్ చేతుల్లో ప్రజాప్రభుత్వ యంత్రాంగం ద్వారా ప్రజాశయాలను ఆర్థిక శక్తి, నైపుణ్యాలతో సాధించవచ్చునని మనం నిరూపించాము. దీనితో పాటు మనమింకెంతో చెయ్యాలని కూడ గ్రహించాలి. అది కాంగ్రెస్ సంస్థ హయాంలోనే సాధ్యపడగలదు.

ఇతరదేశాలు సాంఘిక, ఆర్థిక స్వాతంత్ర్యమెలా సాధించు కొనగలిగారో మనకు తెలుసు. తన భవితవ్యాన్ని తాకట్టు పెట్టడం ద్వారా యేదేశమూ అభివృద్ధి పొందలేదు. ఎట్టి అభివృద్ధి చెందక చాలవెనుకబడ్డ దేశం మనది. మనదేశాభిమానమే ప్రధానంగా మనం చాల నిరాడంబర జీవితాన్ని అలవరచుకోవాలి. మనం ప్రతి అణా కూడ పెట్టి మనదేశాభివృద్ధి కార్యక్రమానికి తోడ్పడాలి. ఐచ్ఛికంగా మనం కాయకష్టం చేసిగాని, బుద్ధిబల ముపయోగపరచిగాని అభివృద్ధికితోడ్పడాలి. అలా కూడబెట్టిన సంపదను ఆర్థికరంగం ప్రాథమిక, మధ్య దశల్లో అభివృద్ధి కుపయోగించాలి. ప్రజాచైతన్య మెక్కువైన కొలది అన్నిరంగాల్లోనూ సమానాభివృద్ధి పొందని యెడల ప్రజాస్వామ్యానికి ప్రమాదం వాటిల్లగలదు.

కమ్యూనిటీ ప్రాజెక్టులు :

మనకమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయ విస్తరణ కేంద్రాలు గాంధిఘర్ మొదలైన వాటినన్నిటిని శ్రద్ధతో నిర్వహించాలి మనదేశాభివృద్ధిని కోరడమేగాక, మనం కాంక్షించే సాంఘిక పతులపై నే అభివృద్ధి చెందాలి. భూదానోద్యమ సంపూర్ణప్రభావాన్నికూడ మనం విస్మరించరాదు. మానవహృదయ పవర్తన కదొకప్రయోగము. మానవుల మన స్తత్వాభివృద్ధికి,

అంతశ్శక్తి పెంపుదలకు చివర కదే సాధనం కాగలదు. మనః పూర్వకంగా బలపరచడమే గాకుండ ఆ వుద్యమంలో లీనమై పోవడంకూడ అవుసరము

నిర్మాణ కార్యక్రమంలో శక్తివంతంగా నిర్మాణమైన సంస్థే ప్రజాప్రభుత్వానికి పూర్తి సహాయకారి కాగలదు. అహింసాత్మక విప్లవానికి రెండే ఆయుధాలున్నవి. ఒకటి ఆశయాత్మకం, రెండవది ఆచరణాత్మకం. ఆశయాత్మకం సేవాత్యాగాలతో మన అంతశ్శక్తిని అభివృద్ధిచేసుకోవడం. ఆచరణాత్మకం నిర్మాణ కార్యక్రమంద్వారా జనసామాన్యంతో కలిసిపోయి మనం కాంక్షించే సాంఘికవ్యవస్థకు వారిని సుముఖులుగా చెయ్యటం. ఖాదీ, చెరఖాద్వారా సమైక్యతను సాధించాలి. మనకు సంతృప్తికరంగా సంపూర్ణాభివృద్ధిపొందాలంటే గాంధీ మహాత్ముని నిర్మాణకార్యక్రమంలోని చరఖా, ఖాదీ,తదితరంశాలను నిర్లక్ష్యం చేయలేము. మహాత్ముడు మనకు చూపిన ఆదర్శాలు సంపూర్ణంగా కాక, కొన్ని నిదర్శనా లేచూపించాడు. ప్రపంచమంతా విప్లవవాతావరణంతో నిండియున్నట్లు మన దేశముకూడ విప్లవమార్గాన్నే పురోగమిస్తున్నది. అయితే మన విప్లవమార్గం భిన్నమైనది. భారతావని స్థిరసంపత్తులతో పురోగమించడమేగాక మిగిలిన పీడితప్రపంచానికి ఆశాజ్యోతి కావాలంటే మనవిప్లవచక్రపరిభ్రమణం సంపూర్తి కావాలి. అట్టి విశాలదృక్పథంతోనే భారతవిప్లవాన్ని కొనసాగించాలి. అట్టి ఆపవిత్రాశయంతోనే ముందుకు నడుద్దాం.

(ఆవడికాంగ్రెస్ అధ్యక్ష పదవిని స్వీకరిస్తూ యిచ్చిన వుపన్యాసం)

అనువాదం: ఆలూరి నారాయణరావు.



మట్టి - కాంక్రీట్‌తో తయారౌతున్న హీరాకుడ్ డామ్ ప్రాజెక్టులోని
ఒకభాగం. 1956 జులైనాటికి పనిపూర్తవుతుంది.

1. సానుభూతి :

ఈ కాంగ్రెస్ మహాసభ, గత సమావేశానంతరమింత వరకు స్వర్గస్థులైన 48 భారతనాయకులకై, కాంగ్రెసు సేవకులకై అమితవిచారాన్ని తెలియజేస్తోంది.

2. సోషలిస్టు సమాజవ్యవస్థ :

కాంగ్రెస్ నిర్మాణసూత్రాలలోని మొదటి ఆర్టికల్‌లో నుదహరించిన, ఆశయాలనూ, భారతరాజ్యాంగ పీఠికలోను, ప్రభుత్వ విధానపు మార్గదర్శక సూత్రాలలోను వివరించిన లక్ష్యాలనూ సాధించడంకోసం, సోషలిస్ట్ సమాజవ్యవస్థాపనా పథకాన్ని తయారుచేయవలసివుంది. ఇందు, ప్రధానోత్పత్తిసాధకాలు, సమాజ యాజమాన్యాన లేక అజమాయిషీలోవుంటాయి. ఉత్పత్తివేగంగా అధికతరం చేయబడుతుంది. జాతీయ సంపద న్యాయంగా పంచబడుతుంది.

3. భారతదేశంలో విదేశస్థావరాలు :

భారత దేశములోని ఫ్రెంచి స్థావరాలు ఇండియన్ యూనియన్‌లో విలీనమవుటను కాంగ్రెస్ ప్రమోదముతో గమనించింది. భారతరిపబ్లిక్ పౌరులుగను, విశాల భారత కుటుంబములోని సభ్యులుగను, ఈ స్థావరీయులను కాంగ్రెస్ మనఃపూర్వకముగా ఆహ్వానిస్తూన్నది. వారి పురోగమనాన్ని, భివృద్ధిని హృదయపూర్వకముగా వాంఛిస్తున్నది. చారిత్రాత్మకమైన యీ మార్పు, ఫ్రెంచిరిపబ్లిక్‌తో స్నేహపూర్వక

మైన ఒడంబడిక ద్వారా జరిగింది. అది కాంగ్రెసుకు మరింత ఆహ్లాద కారణము. పుదుచ్చేరిలోని ఫ్రెంచి సంస్కృతి పరిరక్షింప బడుతుందని, అది భారత సంస్కృతీ సౌభాగ్యానికు దోహదం చేస్తుందని, మనప్రభుత్వమిచ్చిన వాగ్దానాన్ని కాంగ్రెస్ ఆమోదిస్తున్నది.

2. భారతదేశములోని పోర్చుగీస్ స్థావరాలుకూడ, త్వరలో ఇండియన్ యూనియన్‌లో విలీనమై, ఆ స్థావరీయు చిరకాలవాంఛితాన్ని పరిపూర్తి చేస్తనని, తద్వారా, భారదేశ రాజకీయసమగ్రత సాధించబడుతుందని కాంగ్రెస్ విశసిస్తున్నది.

4. అంతర్జాతీయ వ్యవహారాలు :

ప్రపంచ వ్యవహారాల్లో యీ మధ్య జరిగిన సంఘటనలు కొన్ని, అంతర్జాతీయ ఉద్రిక్తతను కొంతవరకు తగ్గించినందుకు కాంగ్రెస్ సంతసిస్తున్నది. ఈ విధానమింకనూ కొసాగింపబడి, అంతర్జాతీయ సంబంధాలలో, మరికొంత మంచి జరుగుతుందని ఆశిస్తున్నది. ఇండో-చైనాను గురించి జరిగిన జనీవా ఒడంబడిక, గత యేడు సంవత్సరాలనుండి జరుగుతున్న యుద్ధాన్ని ముగింపు చేయడమే గాకుండా, ఈ తరంలో మొదటిసారిగా ప్రపంచం మొత్తంమీాద యెక్కడా పోరటంలేని, పరిస్థితిని కలుగజేసింది. ఈ ఒడంబడిక ఆగ్నేయాసియాలోని ఈ ముఖ్యమైన ప్రదేశంలో శాతిస్థాపనకు దారితీస్తుందని నమ్ముతూన్నది. భారతదేశము, కెనడా, పోలండ్ లతో కలిసి, ఇండో-చైనాలో గురుతర బాధ్యతలను స్వీకరించింది. అంతర్జాతీయ పర్యవేక్షక సంఘు మచట నిర్వహి-

గిన సాంస్కృతికరమైన పనికి కాంగ్రెస్ సంతసిస్తూ, బయటి శాంతి సంఘము గాని, ప్రవేశము గాని లేకుండా ఈ దేశముల భవిష్యత్ జనీవా ఒడంబడికలో నుదహరించినట్లు, ఆ యా దేశముల చేతనే పరిష్కృత మౌతుందని ఆశిస్తున్నది.

2 కొరియాలో యుద్ధము ముగిసినను, శాంతి యింకా అవ్యక్తంగానే వుంది. అంతర్జాతీయ పరిస్థితిలోని ఈ మహా పరివర్తనము మరింత విస్తృత సంఘర్షణకు దారితీయ కుండా వుండాలంటే కొరియాలో శాంతిస్థాపన జరగాలి. తన్మూలంగా ఆసియాలోను, ప్రపంచంలోను నిలకడయైన పరిస్థితి యేర్పడుతుంది. అందుచే కొరియా సమస్య శాంతి యుతముగా పరిష్కారము కావడానికనువగు రాయబార సంభాషణలింకను కొనసాగింప బడతవని కాంగ్రెస్ ఆశి స్తున్నది.

3. పశ్చిమఖండాల్లోని అగ్రదేశాలు కొన్ని, ఆగ్నే యాసియాదేశాలు మరికొన్నికలసి, ఆగ్నేయాసియా రక్షణ సంస్థను స్థాపించడం విచారకరమైన విషయం. ఈ సంస్థా స్థాపన ఆ ప్రదేశాలకు మరింత ప్రమాదకరపరిస్థితిని తెచ్చిపెడు తుంది. ప్రచ్ఛన్న యుద్ధవాతావరణాన్ని యిది వృద్ధిచేస్తుంది.

4. ఇరుగు పొరుగు దేశాలమధ్యా, నిజానికి, ప్రపంచం లోని అన్నిదేశాలమధ్యా, స్నేహపూర్వక సహకారమూ, ఒకరినొకరు అర్థంచేసికోవడమూ వున్నప్పుడు మాత్రమే నిజ మైన శాంతి స్థాపన కవకాశం కలుగుతుందని కాంగ్రెస్ నమ్ము తూన్నది. భారత, చైనా, బర్మాదేశాలు కలసి ప్రకటించిన, యీ మధ్య భారత, యుగోస్లేవియాదేశాలు పునరుద్ఘాటించిన

'పంచశీల' సూత్రాల ప్రకారం అంతర్జాతీయ సంబంధాలు సరిదిద్దబడాలి. 'పంచశీల' సూత్రాల కాంగ్రెస్ సంతోషంతో ఆమోదిస్తున్నది. ఇవి అంతర్జాతీయ వ్యవహారాల్లో భారతదేశ దృక్పథమును ప్రతిబింబిస్తున్నవి. అవి సమిష్టి యుద్ధానికి బదులు సమిష్టి క్షేమానికి ప్రాధాన్యతను తీసికొనివస్తవి. ఈపంచశీల సిద్ధాంతము లాధారముగా, శాంతి యుత సమాజీవనం స్థాపించబడాలని కాంగ్రెస్ అభిప్రాయపడు తూన్నది. నాగరికత విచ్ఛిన్నంగాకుండా నిలబడాలంటే ప్రస్తుత పరిస్థితులలో యీ మార్గంకంటే గత్యంతరం లేదు.

5. చైనాకు ఐక్యరాజ్యసమితిలో, దీర్ఘకాలంనుం ప్రవేశంలేకుండా చేయడం చాల సంతాపకరమైన విషయము. ఇది ఆసియాలోను, ప్రపంచంలోను, శాంతిస్థిరతాలను దెబ్బతీస్తుంది. ఈ వర్తమాన వత్సరములోనైనా, చైనా ఐక్యరాజ్యసమితిలో తన అగ్రస్థానాన్ని పొందుతుంద.- కాంగ్రెస్ గాఢంగా ఆశిస్తున్నది.

6. ఆఫ్రికా, ఆసియా స్వతంత్రదేశాల సమావేశాన్ని యేర్పాటుచేయడానికి గతవర్షం కొలంబో సమావేశంలో ఇండోనేషియాచేసిన సూచనను కాంగ్రెస్ ఆమోదిస్తూ, ఆ సమావేశం జయప్రదం కావాలని కోరుతూన్నది.

7. అటం, హైడ్రోజన్ బాంబుల ఉత్పత్తి, ప్రపంచ శాంతికి, నాగరికతకు మహోపద్రవ కారణమైంది. హైడ్రోజన్ బాంబుల ప్రయోగం సహితము మనకింకా సంపూర్ణంగా తెలియరాని వాని ఫలితాలవల్ల, అఖిల ప్రపంచాన్ని భయపెట్టి మానవజీవితానికి, నాగరికతకు, శాశ్వత నష్టాన్ని

కెచ్చిపెడుతోంది. నాగరికతను వినాశనం చేసింది. పరిరక్షించాలంటే, అటం, హైడ్రోజన్ బాంబుల వుత్పత్తి, వాటి ఉపయోగమును, పూర్తిగ నిషేధించడమే గాకుండా, సమిష్టి వినాశనాన్ని కలుగజేసే తదితర పరమాణు ఆయుధ పరికరాలను కూడా పూర్తిగ నిషేధించాలి. ఈ ప్రయోగాల నరికట్టవలసినదిగాను, ఐక్యసమితి తాలుకు నిరాయుధీకరణ సంస్థ యీవిషయాన్ని తక్షణం పరిశీలించవలసినదిగాను కాంగ్రెస్ కోరుతున్నది. ఈ అస్త్రశస్త్రా, పరమాణాయుధముల, వుపయోగ ప్రయోగముల యొక్క ఫలితాల శాస్త్రీయ విశదీకరణకు తగు సత్వర చర్యలు తీసికొని ప్రజాబాహుళ్యం, నేటి యుద్ధోపద్రవాలను గుర్తించేటట్లు చేయాలని కాంగ్రెస్, ఐక్యరాజ్య సమితికి సూచిస్తున్నది.

8. భారతప్రభుత్వపు విదేశాంగ విధానాన్ని కాంగ్రెస్ పూర్తిగా హర్షిస్తున్నది. ఒక దేశముయొక్క జాతీయవిధానము, అంతరంగిక వ్యవహారములు కట్టుదిట్టముగా నున్నప్పుడే, ప్రపంచ శాంతి గమ్యానికి చేరే సరియైన మార్గాన్ని, దృక్పథాన్ని అది కలిగియున్నప్పుడే, ఆ దేశముయొక్క విదేశాంగ విధానము కూడా జయప్రదమవుతుంది.

5. ఆర్థిక విధానము :

దేశ ఆర్థికపరిస్థితులలో కలిగిన అభివృద్ధికి, పంచవర్ష ప్రణాళికలోని చాల హంశములు అంచనాలను మించి జయప్రదముగా నిర్వహింపబడి నందులకు కాంగ్రెస్ తన సంతృప్తిని తెలియపరుస్తూన్నది. ప్రత్యేకముగా ఆహారధాన్య పరిస్థితులలో, నదీలోయ ప్రణాళికలలో సాధింపబడిన అభివృద్ధికి

సం.క.పాన్ని తెలియజేస్తున్నది. ఇవి ఉదాత్తాశయాలకేగాక, ఘనకార్యాలకు కూడ చిహ్నములు. షుమారు యెనుబది వేల గ్రామాలలో అయిదుకోట్ల ప్రజానీకం మధ్య అమలుజరుప బడిన జాతీయ విస్తరణ సేవా ప్రణాళికలలోను, కమ్యూనిటీ ప్రాజెక్టులలోను సాధింపబడిన పురోగమనాన్ని కాంగ్రెస్ సంతృప్తితో గమనించింది. ఈ బృహత్కార్యము, యావత్తు గ్రామీణ భారతదేశముయొక్క స్వభావ, స్వరూపాలలో ప్రధానమగు మార్పులను కలిగించేదై వుంది. ఈ అభివృద్ధి శిక్షణపొందిన ఉద్యోగుల ద్వారానే గాక, ఆ యా ప్రణాళికల యెడ ప్రజలు చూపిన సహకారమువల్లనూ సాధింపబడింది.

2. ఈ విధంగా సాధింపబడిన పురోగమనం భారత ప్రజల సర్వతోభివృద్ధికి ప్రధానమైన పునాదివేసి వేయుకలిగింది. పంచవర్ష ప్రణాళికయెడ ప్రజలు చూపుతున్న ఆసక్తివలనను, దేశం నలుమూలలలో రేకెత్తిన సాంఘికచైతన్యం వలనను యీ విషయం విదితమౌతున్నది. అధికోత్పత్తి, జీవన గరిష్ట ప్రమాణం, నిరుద్యోగ నిర్మూలనం రానున్న పది సంవత్సరాలలో మనము సాధించవలసిన ఖచ్చితమైన ఆశయముగా పెట్టుకొని, ఆర్థిక, సాంఘికస్థాయిలలో పురోగమించవలసిన తరుణ మాసన్నమైనది. శ్రేయోరాజ్యం, సోషలిస్ట్ ఆర్థిక విధానం మన జాతీయ ధర్మములై వున్నవి. జాతీయాదాయము బాగా పెంపొందించడం, వస్తూత్పత్తి యెక్కువ చేయడం, నిరుద్యోగ సమస్యను పరిష్కరించడం ద్వారానే యివి సాధించబడగలవు. అందుచే మన ఆర్థికవిధానం, అధికోత్పత్తి, సమపంపిణీలనే ఆశయాలుగా కలిగివుండాలి.

3. ప్రజల భౌతికావసరాలను దేశములోని ఉత్పత్తి మూలంగా తీర్చాలి. దీన్నే మనద్వితీయ పంచవర్ష ప్రణాళిక దృష్టిలో నుంచుకోవాలి. ఇందుకుగాను భారీపరిశ్రమలను స్థాపించడంతోపాటు, చిన్నపరిశ్రమలను, గృహపరిశ్రమలనుకూడా, విస్తృతంగా అభివృద్ధి పరచాలి. ఈ ప్రణాళిక యొక్క విజయం, జాగ్రత్తతో చేసిన అంచనాలపైనను, ప్లానింగు మీదనూ, సరియైన సూచన లివ్వడంపైనను మాత్రమే గాకుండా ప్రజలయొక్క పూర్ణ సహకారముపై కూడా ఆధారపడి వుంటుంది. అందుచే ప్రజలతో బాగా సంప్రదించడంమీదనే యీ ప్రణాళిక ఆధారపడి యుండాలి.

4. ప్రభుత్వముయొక్క ప్రకటిత లక్ష్యం సోషలిస్టు సమాజ వ్యవస్థయే అవడంచేత, దానికి నిర్మాణ అభివృద్ధి పథకాల్లో ముఖ్యపాత్ర తీసికోవలసిన అవసరమేర్పడింది. ప్రత్యేకంగా ప్రభుత్వమే

(1) విద్యుచ్ఛక్తి రవాణా మొదలగు పెద్దస్కీములను ఆరంభించి కొనసాగించాలి.

(2) ఉత్పత్తి స్థానములపై, సాంఘికావసరములపై, ఆర్థిక విధానములో ముఖ్యమైన ఆదాయ వ్యయములపై ప్రభుత్వానికి పూర్తి కంట్రోలుండాలి.

(3) కీలకమగు పరిశ్రమలపై కంట్రోలు నమలుజరిపి, గజబిజిగా పెరిగే పరిశ్రమలయొక్క చెడుఫలితాల నరికట్టాలి. ప్రయివేటు ట్రస్టుల నరికట్టి ఉత్పత్తియొక్కయు, శ్రామిక వర్గముయొక్కయు స్థాయిని కాపాడాలి.

(4) దేశీయ, ఆర్థికవిధానాన్ని సహజ, విశాలదృక్పథాలతో నిర్మించాలి.

(5) మొదటి పంచవర్ష ప్రణాళిక రెండు విషయాల్పై ఆధారపడివుంది. ఒకటి ప్రయివేటు రంగం. రెండవది ప్రభుత్వ రంగం ఇందు ప్రభుత్వరంగం, అత్యంత ప్రధానమైన పాత్రను ప్రత్యేకముగా ప్రధాన పరిశ్రమల స్థాపనతో- వహించాలి.

అయినా ప్రయివేటురంగం అనగా ప్రభుత్వపరంగాని రంగముయొక్క, ఐచ్ఛిక వ్యాపారముయొక్క ప్రాధాన్యత సహితము వుంటూనే వుంటుంది. సహకార సంస్థలు, చిన్న పరిశ్రమలు, యీరంగానికి చెందుతవి. ప్రస్తుత భారతదేశ పరిస్థితులలో ఉత్పత్తి పెరుగుదలకు, నిరుద్యోగ నివారణకు యిట్టి ప్రయివేటు వ్యాపారసంస్థలు అవుసరం అవుతున్నవి. అందుచే యీ ప్రయివేటు రంగము మన జాతీయనిర్మాణ ప్రణాళికకు అనుగుణంగావుంటే మన గమ్యాన్ని యింకా వేగంగాను, సమగ్రంగాను సాధించడానికి వీలుపడుతుంది. కావున ప్రయివేటు రంగానికి మన ఆర్థిక విధానంలో ప్రస్తుత మొక ప్రత్యేకస్థానమున్నది. ఆ కారణముగా దీనిని జాతీయ [illegible]ణాళికయొక్క కీలకమగు కంట్రోళ్ళకు లోబడి, తన విద్యు[illegible] పాత్రనది నిర హించునట్లు యీ ప్రయివేటురంగాన్ని కూడ ప్రోత్సహించాలి

6. భారతదేశమును నేడొక గొప్ప సవాలు యెదుర్కొన్నది. పురోగమనం వైపు ప్రజలకున్న వాంఛచేతనే గాక పరిస్థితులయొక్క యిబ్బందిచేత కూడా సాంఘిక, ఆర్థిక పారిశ్రామిక రంగాల్లో సుదీర్ఘ పరిణామాలను తీసికొచ్చే-

వేగంతో పురోగమించవలసిన అవసరం యేర్పడింది. శాంతి యుతంగా ప్రజాస్వామ్య విధానాల ద్వారా యీ మార్పును వేగవంతంగాను, శక్తివంతంగాను తీసికొనిరావడమే యిప్పుడు మన మెదుర్కొనవలసిన సవాలు. ఇంతవరకు జరిగిన పురోగమనాన్ని వేయబడిన బలమైన పునాదినిబట్టి చూస్తే, భారతదేశ ప్రజలీ సవాలు నెదుర్కొని వారిపైనుంచిన గురుతర బాధ్యతలు నిర్వహించగలరని కాంగ్రెస్ విశ్వసిస్తున్నది.

6. ఐక్యత – సమగ్రత :

భారత దేశ ప్రజల, సౌభాగ్యాభ్యుదయాలు రాజకీయార్థిక పురోగమనాల మీదనే గాక, వ్యక్తిగత, సాంఘికాభివృద్ధుల కాటంకాలను తొలగించే సంఘసంస్కరణపైకూడా ఆధారపడి వున్నై. భారతీయ ఐక్యతను కాపాడాలంటే, ఐక్యతావిచ్ఛిన్న కారకమగు ప్రత్యేకతా తత్వమును పూర్తిగ నిరసించాలి. భారతదేశముయొక్క వివిధత్వాన్ని, సంస్కృతి సంపదను కాపాడుతూ, అదేసమయంలో దానియొక్క సమగ్రతను, తాత్వికంగా, సంస్కృతికంగా సాధించాలి. ఎవరికి వారే అను ప్రత్యేకతా తత్వాన్నే గాకుండా ప్రజాస్వామ్య లక్ష్యమగు సమానత్వ, వైరుధ్య భావాలు గల వర్గ విభేదములను సహితము నిర్మూలించాలి. మరియు మతాన్ని, రాజకీయాల్ని కలుషితం చేసే కులతత్వాన్ని గట్టిగా అణచివేయాలి. భారతదేశ సమగ్రతను, ఐక్యతకు విచ్ఛిన్న కారకమును, సంకుచితమునగు రాష్ట్రీయ తత్వాన్ని యెదిరించాలి.

1. సంస్థను బలవత్తర మొనరించుట – నిర్మల మొనరించుట :

సమగ్రమైన ప్రజాస్వామ్యము యొక్క మనుగడకు, బలమైన, శక్తివంతమైన, ఉదాత్తమైన రాజకీయ సంస్థ యెంతేని అవసరము. అత్యధికమగు జనసంఖ్యయు, అనంతమగు సమస్యలును కలిగిన సువిశాలమైన భారతదేశములో అట్టి సంస్థయొక్క ప్రయోజనము యింకా యెక్కువ. గతములోను, యీ మధ్యను అది యొనరించిన సేవలద్వారా కాంగ్రెస్ ప్రజాహృదయంలో నొక విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకొన్నది. తనపైనుంచిన అట్టివిశ్వాసముమూలముగాను, ఐక్యతవలనను కాంగ్రెస్ అనేక కఠిన సమస్యలను, వివిధ సమస్యలను పరిష్కరించ గలుగుతూన్నది. ప్రజలకు అభివృద్ధికరమైన స్థిరప్రభుత్వాన్ని యివ్వగలిగింది. ప్రజాస్వామ్య పద్ధతులపై నిర్మాణాత్మకమైన, క్రమానుగతమైన, బహుముఖమైన అభివృద్ధిని సాధించడానికి పూనుకోగలిగింది. దేశస్వాతంత్ర్యాభ్యుదయముల కోసము తానొనరించిన అసమాన సేవాత్యాగములవైపు కాంగ్రెస్ గర్వముతో, సంతృప్తితో చూడగలుగుతున్నది.

2. కాని యీ సంస్థలో పొడచూపుతున్న కొన్ని అవాంఛనీయ మార్గాలను, అభిప్రాయాలను, కాంగ్రెస్ మిగులప్రమాదకరమైనవిగా భావించి చూస్తున్నది. ఈమార్గాలు, భావాలు నైతిక, సాంఘికస్థాయిలలో మిక్కిలి పతనాన్ని సూచిస్తున్నవి. ఇవి మన సంస్థను మిగుల బలహీన పరచడానికి అవకాశముంది. అవి దాని మర్యాదను గౌరవాన్ని తగ్గించేవిగావున్నై. కాంగ్రెస్ భారతదేశ ప్రజలకోసము, ప్రపంచ ప్రజాస్వామ్యము

కోసము పనిచేసే సామర్థ్యతను కుంటుపడేటట్లు చేసేవిగ వున్నవి. కాంగ్రెస్ అట్టి మన స్తత్వాన్ని చూస్తూ మిన్నకుండ లేదు. అందుచే సంస్థానిర్మాణములోగల పవిత్రతను కాపాడడానికి, సరియైన క్రమశిక్షణను సాధించడానికి, ముఖ్యా, వ్యక్తి నిరంకుశత్వాలను గట్టిగా అణచడానికి అనువగు కఠినచర్యలు తీసికోమని, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీని ఆదేశిస్తున్నది.

3. దేశములో ప్రభుత్వాలను నిర్వహించడమేగాక, కాంగ్రెస్‌కు మరొక విశిష్టమైన స్థానమున్నది. ప్రజాస్వామ్య ప్రభుత్వపు గురుతర బాధ్యతను స్వీకరించడానికి, ప్రజానీకాన్ని సంసిద్ధంగా జేసే కర్తవ్యము ఒకటి దానిపై నున్నది. అప్పుడే ప్రభుత్వము, తన సాంఘికాశయాలను నెరవేర్చుకో గలుగుతుంది.

ప్రజలలో సాంస్కృతిక, నైతిక దృక్పథాలను కలిగించ వలసిన కర్తవ్యము కాంగ్రెస్‌కున్నది. అలా అయితేనే దేశముయొక్క సహజ సాంస్కృతిక సమగ్రతను సాధించడానికి వీలుంటుంది. సంస్థయొక్క ప్రధాన సిద్ధాంతాలకు విరుద్ధమైన మతభావాలకు అందు స్థానము లేకుండా గ గా చూడాలి.

4. అట్టి అహితమైన, అవాంఛనీయమైన, మ త్వాన్ని, భావాన్ని, పట్టుదలతో, కఠినంగా పెరికి పారవేయు డము చేతను, నిర్మాణాత్మకమైన పురోగమన కార్యక్రమాన్నములు జరపడముచేతను, సంస్థలోనున్న పొరపొచ్చెములను తుడిచివైచి, దానియొక్క బల గౌరవాల నధికంచేస్తే, భారతదేశ ప్రజలను, వారిద్వారా అఖిల మానవజాతికి తానొ

వహించవలసిన చారిత్రక కర్తవ్యాన్ని నిర్వహించడానికి వీలు పడుతుందని కాంగ్రెస్ నమ్ముతూన్నది.

8. నిర్మాణాత్మక అభివృద్ధి కార్యక్రమము :

"నిర్మాణాత్మక అభివృద్ధి కార్యక్రమము" పై అఖిల భారత కాంగ్రెస్‌కమిటీ అజ్మీరులో జూలై 24వ తారీఖు 1954న చేసిన తీర్మానాన్ని యీ కాంగ్రెస్ ఆమోదిస్తున్నది.

నోటు : పైనుదహరించిన తీర్మానమిది :—

"కాంగ్రెస్ రాష్ట్ర, కేంద్రాలలో, ప్రభుత్వ నిర్మాణబాధ్యతను స్వీకరించడానికి పూనుకోవడముచేత అవసరమైన, పార్లమెంటరీ కార్య ప్రణాళికను సదా శ్రద్ధతోను, ఆసక్తితోను, గమనిస్తూండవలసిన అవసర మేర్పడింది. కాని కాంగ్రెస్ యెల్లప్పుడు నిర్మాణకార్యక్రమముపై పే యెక్కువ మోజుచూపుతుంది. నిజానికిట్టి నిర్మాణకార్యక్రమాలు వాటంతటవే ప్రధానమైనవేగాక, పార్లమెంటరీ కార్యక్రమముయొక్క విజయానికివి నాందీప్రస్తావన లనిచెప్పవచ్చును.

2. కాంగ్రెస్‌కు బలము ప్రజల్లోనుంచే వచ్చింది. ప్రజలలోనే అది ప్రవేళ్లుతన్నుకొంది. ప్రజల కది నిర్మాణకార్యక్రమము మూలముగానే సేవ చేసింది. ఈకార్యక్రమాల పరిధి యిప్పుడు హెచ్చింది. అవకాశాలు హెచ్చినై. నిజానికిప్పు డీనిర్మాణకార్యక్రమము దేశములోని అన్ని అభివృద్ధి ప్రణాళికలకు వ్యాపిస్తుందన్నమాట. లోకసభ, రాష్ట్ర అసెంబ్లీలలోని కాంగ్రెస్ సభ్యులు తమతమ నియోజక వర్గాలతో సదా సన్నిహితత్వము కలిగి నిర్మాణాత్మక, అభివృద్ధి కార్యక్రమాల్లో పాల్గొనాలి.

3. పార్లమెంటరీ కార్యక్రమముతో ప్రత్యక్ష సంబంధములేని కాంగ్రెస్‌వాదులపై యొక ప్రత్యేకబాధ్యతవుంది. వారికీ నిర్మాణాత్మక అభివృద్ధికార్యాలలో పాల్గొనవలసిన ప్రత్యేకతయెక్కు వగావుంది. కాంగ్రెస్ మొదటినుండి అనుసరిస్తున్న నిర్మాణాత్మక కార్యాలైన జాత్యైక్యత, హరిజన సేవ, ఆదివాసిసేవ, గృహపరిశ్రమ, గ్రామీణ పరిశ్రమలు యీ కార్యక్రమములో చేరినవే. భూదానోద్యమ కృషి, సహకారసంస్థలు, పంచవర్ష అభి-

స్వచ్ఛంద ప్రణాళికలలో విశిష్టమైన సహాయకార్యాలు, యివన్నీకూడా, యీ నిర్మాణాత్మక కార్యక్రమములో చేరినవే. కాంగ్రెస్ ప్రత్యేకము సమాజ వికాసకేంద్రాలకోసం, జాతీయవిస్తరణ సేవాప్రణాళికల్లోను యెక్కువగా పాల్గొని సహకరించాలి.

ఈ ప్రణాళికలక్రై నిర్దేశించిన సలహాసంఘాల్లో పాల్గొనడమేగాక, ఆయాప్రణాళికలలో పనిచేయు సేవకులకోసము, గ్రామసేవకులకోసము యేర్పాటుచేయబడే శిక్షణ కేంద్రాలలోకూడా పాల్గొనాలి.

4. ఈ విధంగా కాంగ్రెస్ నవభారత నిర్మాణం అనే బృహత్కార్యంలో ప్రత్యక్షముగా పాల్గొంటుంది. కాంగ్రెస్‌వాదులు ప్రజాసామాన్యంతో ప్రత్యేకంగా గ్రామీణ ప్రాంతాలతో సన్నిహిత సంబంధము కలిగి సేవచేయాలి.

5. అఖిలభారత కాంగ్రెస్‌కమిటీ, యీ నిర్మాణాత్మక అభివృద్ధి కార్యక్రమాన్ని కేంద్రప్రభుత్వం యిప్పటికన్నా సమర్థవంతంగా యేర్పాటు చేయమని అభ్యర్థిస్తూ, ప్రధాన కార్యదర్శిని ఆదేశిస్తున్నది.

9. శిశు, స్త్రీ జనసంక్షేమము :

ప్రస్తుతము సాంఘికరీత్యా, చట్టరీత్యా స్త్రీలు యెన్నో యిబ్బందులకు గురి అవుతున్నారు. అభివృద్ధి నిరోధకమైన ఆచారాలు, ఆనవాయితీలూ వారి పురోగమనాన్ని కుంటుపడ జేస్తున్నవి. అంచేత వారు దేశసంబంధమైన వివిధకార్యక్రమాల్లో పాల్గొనడానికి వీలైన అర్హస్థానాన్ని పొందలేక పోతున్నారు. కావున యీ చెడుగుల నన్నిటినీ తక్షణము తొలగించి అంతమొనరించాలి. భారతదేశచరిత్ర పరికిస్తే, వివిధ రంగాల్లో స్త్రీలు మహోన్నత స్థితిని సాధించిన వుదాహరణ లెన్నో వున్నై. స్వాతంత్ర్య పోరాటములో వారు అమితోత్సాహముతో పాల్గొన్నారు. ప్రస్తుతము వారికి, అభివృద్ధి చెందడానికి, సేవచేయడానికి పూర్ణావకాశాలుండాలి. సాంఘిక రీత్యా, చట్టరీత్యా యెట్టి యిబ్బందులకు లోనుగాకుండా

వుండే టందులకు, వారసత్వపుహక్కు వారికుండాలి. ఇట్లా వుండటం వాంఛనీయమేగాకుండా, జాతిక్షేమందృష్ట్యా అవసరంకూడా.

2. శిశు సంక్షేమము అతిప్రధానమైంది. అందుచేత జాతీయాభివృద్ధి ప్రణాళికలో దీనికి ప్రథమస్థాన మివ్వాలి.

3. వివిధ రాష్ట్రాలు, ఈ శిశు, స్త్రీసంక్షేమం విషయంలో చేసిన యత్నాలను కాంగ్రెస్ హర్షిస్తూ, యింకా ఆ విషయంలో మరింత యెక్కువ శ్రద్ధ తీసుకోమని కోరుతున్నది. ప్రస్తుతం లోక్‌సభలో చర్చింపబడుతున్న హిందూ న్యాయ సంస్కరణ బిల్లును కాంగ్రెస్ ఆమోదిస్తూ అతిత్వరలో శాసనమవుతుందని ఆశిస్తూన్నది.

10. వరద నివారణ :

గత సంవత్సరం వరదల మూలంగా బాధపడిన లక్షలాది ప్రజలకు కాంగ్రెస్ హృదయ పూర్వకమైన సానుభూతిని తెలియపరుస్తున్నది. ఈ బాధితులకు సహాయ మొనరించడాని, ఆ యారాష్ట్ర ప్రభుత్వాలూ, కేంద్ర ప్రభుత్వమూ తీ కొన్న చర్యలను కాంగ్రెస్ హర్షిస్తున్నది. మనదేశీయులు వి శవాసులూ ఈ వరద బాధానివారణకై స్థాపించబడి నిధులకు ఉదాత్తంగా విరాళాలివ్వడం, మానవులు యెంత దూరంలో వున్నా ఒకరియందు ఒకరికిగల సానుభూతికి చిహ్నము, వారిని ఒక్కటిగా బంధించిన సూత్రముల గుర్తు. ఈ వరద ప్రదేశాలలో ప్రజలు ప్రదర్శించిన ఆత్మవిశ్వాసాన్ని, సహసాన్ని, పరస్పర సహాయాన్ని కాంగ్రెస్ సంతృప్తితో గమనించింది. భీరు తమ బాధానివారణకై వూరికే వుచితే

మైన సహాయాన్ని పొందడానికి బదులు, కష్టమనే స్వయం కృషినే వరించినందుకు కాంగ్రెస్ సంతసిస్తున్నది. అట్టి సమయాల్లో అందరికీ పనులు కల్పింపబడాలని కాంగ్రెస్ అభిప్రాయపడుతున్నది.

2. ఈ వరద పిశాచి నెదుర్కొనే కార్యక్రమానికి ప్రప్రథమ స్థానమివ్వడానికి నిశ్చయించి, ఈ విషయంలో చర్యలు తీసికొంటున్నందులకు కాంగ్రెస్, భారత ప్రభుత్వాన్ని అభినందిస్తున్నది. భారీయెత్తున పరిశోధనలు, సర్వేలు కొనసాగింప బడుతున్నవి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అజమాయిషీ క్రింద, నదీలోయ సంఘాలు, వరదనివారణ సంఘాలు స్థాపించబడి వివిధ ప్రదేశాలలో, ఆయా కార్యాలు కొనసాగింప బడుతున్నవి. ఈ వరద నివారణ ప్రయత్నాలు సత్వరం ఫలించాలంటే, భారీయెత్తున మానవశక్తిని సమీకరించి, జరూరైన, వేగవంతమైన కృషి చెయ్యాలి.

3. ఈ నిర్మాణ కార్యక్రమంలో పాల్గొనవలసిందని చేసిన విజ్ఞప్తిని విని, దినదినము ప్రజాసామాన్యము చూపుతున్న శ్రద్ధ సంతృప్తిదాయకమైంది.

ఇలా ప్రజలు తమంతతాము వచ్చిన, సహకరించిన ఉదాహరణలను, ఉత్తర బీహారులోను, అస్సాములోను చూడవచ్చు. అక్కడ వరదప్రాంతాలలోని జనులు, పదహారుమైళ్లు మొదలు యిరవైమైళ్ళపొడవు వరకూ అడ్డుకట్టలు వేయడానికి పూనుకొన్నారు. దినదినాభివృద్ధి పొందుతూన్న యీజనుల ప్రోత్సాహాన్ని, సహకారాన్ని అధికారులు సరిగ్గా, పూర్తిగా వినియోగించుకుంటారని కాంగ్రెస్ ఆశిస్తున్నది.

11. భూదాన సంపత్తిదానములు :

ఆచార్య వినోబాభావే ప్రారంభించిన భూదానోద్యమాన్ని హైదరాబాద్ కాంగ్రెస్ సమావేశము పూర్తిగ ఆమోదించింది. గత రెండుసంవత్సరాలలోను, యీ వుద్యమము చాల సత్ఫలితాల నిచ్చింది. ఇది షుమారు 36 లక్ష యెకరాల భూమిని సేకరించ గలిగింది. వీలైనంత త్వరలో ఆభూమిని తిరిగి పంచిపెట్టడానికి చర్యలు తీసికోబోతున్నది.

2. భూదాన, సంపత్తిదానోద్యమము, ఆర్థిక సమస్యలను పరిష్కరించడమే గాకుండా, ఐచ్ఛికమైన, శాంతియుతమైన సాంఘికార్థిక విప్లవాన్ని కొనివచ్చే నైతికోద్యమముగా కూడా పని జేస్తూన్నది.

ఆచార్య వినోభాజీ నిర్వహిస్తూన్న యీ మహాత్కార్యాన్ని కాంగ్రెస్ మిక్కిలి ప్రశంసిస్తూ, కాంగ్రెస్‌వాదు లందరూ యీ వుద్యమానికి తమ సంపూర్ణ సహాకారా లివ్వాలని కోరుతూన్నది.

12. వ్యవసాయక సంస్కరణలు - గ్రామపరపతి :

మొదటిపంచవర్ష ప్రణాళిక, గ్రామపరపతియొక్క అభివృద్ధి కెక్కువప్రాధాన్యతనిచ్చి, ప్రత్యేకశ్రద్ధ చూపినందుకు కాంగ్రెస్ సంతోషిస్తున్నది ప్రభుత్వము తీసికొన్న వివిధ చర్యలమూలంగా వ్యవసాయకోత్పత్తిలో సంతృప్తికరమైన అభివృద్ధి కానవస్తున్నది. అయినా గ్రామాలలోని, మానవశక్తి, భౌతిక అవకాశాలు యింకా పూర్ణంగా ఉపయోగింపబడడంలేదు. గ్రామాల్లోని పనిపాటులు, జీవనప్రమాణములు యింకా వుండవలసినస్థాయికి చాల తక్కువలో నేవున్నై. దీనికి

ముఖ్యకారణం ఉత్పత్తి, సరకువిడుదలమొదలగు వ్యవసాయక అవసరాలకు కావలసిన డబ్బులేక పోవడం, గ్రామపరిశ్రమలు తక్కువకావడం అయివున్నది. అందుకు దీర్ఘ, మధ్య, స్వల్పవాయిదాలలో లభించే గ్రామీణపరపతియొక్క అవకాశాలను వృద్ధిచేయాలి. ఇందుకుగాను సహకారపరపతిని యిదివరకుకంటె విస్తృతంగావుండేటట్లు పునర్నిర్మాణం చెయ్యాలి. ప్రస్తుత పరిస్థితులలో, ప్రభుత్వమే, విస్తృతంగా సహకార పద్ధతులపై దీన్ని నిర్వహించడంచేత యీ ప్రణాళిక జయప్రదమౌతుంది. ఈ సందర్భంలో ప్రభుత్వం ఇంపీరియల్ బ్యాంక్‌ను జాతీయమొనరించడానికి చేసిన ప్రకటన ముదావహము.

2. గత కొలదిమాసాలుగా, చాల ప్రదేశాలయందు ధాన్యాదుల ధరలలో అకస్మాత్తుగ విపరీతమైన తగ్గుదల కానవస్తున్నది. కావున న్యాయమైన ధరవరులను పడిపోకుండా స్థిరంగా వుండేటట్లు చేయడానికి ప్రభుత్వం అవసరమైన చర్యలను తీసికొని ప్రజలయొక్క కొనుబడి శక్తిని కాపాడాలి. ఇది గరిష్ట ఉత్పత్తికి, సామాన్య శ్రేయస్సుకి యెంతో అవసరం.

3. భూసంస్కరణల విషయంలో శీఘ్రగతిని పురోగమించడానికి, ప్లానింగ్ కమీషన్ సిఫార్సులను అంచెలవారీయైన కార్యక్రమం ద్వారా అమలు జరపడానికి నిశ్చయించుకొన్నందులకు ప్రభుత్వాన్ని కాంగ్రెస్ అభినందిస్తున్నది.

రాష్ట్ర ప్రభుత్వాలు ఈ కార్యక్రమమందు ప్రత్యేక

శ్రద్ధ చూపి త్వరిత గతిని పూర్తి చేయడానికి అవసరమైన అన్ని చర్యలు తీసికుంటవని కాంగ్రెస్ ఆశిస్తున్నది.

13. ప్రాతిపదిక - ప్రాథమిక - మాధ్యమిక విద్య :

స్వతంత్ర భారతదేశము యొక్క జాతీయ ఆశయాలను, సాంఘికావసరాలను సాధించడానికిగాను, నేటి విద్యావిధానములో అతిప్రధానమైన మార్పులు జరగాలి ప్రత్యేకంగా అభివృద్ధి ప్రణాళికలను వేగంగా నిర్వహించడానికి తగిన శిక్షణను యిచ్చేదిగా వుండాలి. విద్యాశాఖవారి మాధ్యమిక విద్యావిధాన పునర్నిర్మాణ ప్రణాళికను, ప్రత్యేకంగా దేశమంతటా సకలార్థక విద్యాలయాలను స్థాపించి జీవితంలో ప్రత్యేక వృత్తులకు తగినట్లుగా విద్యార్థులకు ప్రాతిపదిక శిక్షణనిస్తూ దానితోపాటు ఉన్నత విద్యనుకూడ యివ్వడానికి నిశ్చయించడాన్ని కాంగ్రెస్ హర్షిస్తున్నది.

2. ప్లానింగ్ కమిషన్, ప్రభుత్వము. భారతదేశము యొక్క భవిష్యత్ ప్రాథమిక, మాధ్యమిక విద్యావిధానాలుగా ప్రాతిపదిక విద్యను ప్రవేశపెట్టడానికి యిదివరకే ఆమోదించినవి. ప్రాతిపదిక విద్య ఉత్పత్తి కృషిని సాధనంగా వుపయోగించి విద్యావిషయాలను వివిధ వృత్తులతో సాంఘిక వాతావరణానికనుకూలంగా సమన్వయ పరుస్తుంది. ఇదే భారతదేశ పరిస్థితులను అనుగుణ్యమైన విధానం. ఈ విధానాన్ని సక్రమంగా, గ్రామసీమల్లోను, పట్టణాల్లోను, అమలుజరపాలని రాష్ట్రప్రభుత్వాలను కాంగ్రెస్ కోరుతున్నది.

అనువాదం : రామానంద సరస్వతి.

# కుటీర పరిశ్రమాభివృద్ధికి సక్రమదృక్పథం

వైకుంఠలాల్ మెహతా
( అఖిలభారత ఖాదీ, గ్రామపరిశ్రమలబోర్డు చైర్మన్ )



" ప్రతిమానవునికీ బ్రతికేహక్కున్నది గనుక తిన తిండి, కట్ట గుడ్డ, వుండటానికి నివాసం కలిగివుండే హక్కున్నది... ఏ దేశమైనా భాగ్యవంతంగావున్నదని చెప్పుకోవాలంటే, ఆ దేశంలో వుండే కోటానుకోట్ల సంఖ్యాగాక ప్రజలకు ఆకలిబాధ లేకపోవటమే గీటురాయిగా వుండాలి. "

గాంధి

(22-12-1926 న అలహాబాద్‌లో యిచ్చిన ఉపన్యాస భాగం)

అఖిలభారత కాంగ్రెస్ కమిటీచే నియమింపబడిన ఆర్థిక కార్యక్రమ కమిటీ అధ్యక్షుడుగా శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ కాంగ్రెస్ అధ్యక్షునికి కమిటీనివేదికను సమర్పించి యిప్పటికి 8 సంవత్సరాలైంది. ఆ తరువాత బొంబాయిలో సమావేశమైన అ. భా కాంగ్రెస్ కమిటి ఆ నివేదికను ఆమోదించింది. అప్పటినుంచీ మన సామాజిక, ఆర్థిక జీవిత విధానాలను మార్పుచెందించిన అనేక సంఘటనలు జరిగినయ్. ఆ సంఘటనలను కాలక్రమానుగతంగా వివరించాలంటే, పై కమిటీ నివేదికారచన పూర్తికాగానే మన ప్రియతమ గాంధీజీ మన మధ్య లేకుండ అదృశ్యమయ్యారు; 1950 లో భారత రాజ్యాంగ చట్టం ఆమోదించబడింది; ఆ వెనువెంటనే భారత ప్రభుత్వం ప్రణాళికా సంఘాన్ని నియమించింది; ఆ సంఘం 1952 సంవత్సరాంతానికి ప్రథమ పంచవర్ష ప్రణాళికను ఆచరణలో పెట్టింది. ఈ ప్రణాళిక గడువు పూర్తి కావటానికి యింకా 1½ సంవత్సరాల కాలం వుంది. కాని అప్పుడే ప్రణాళికా సంఘం, ప్రణాళిక యెవరిక్షేమం కోసం వుద్దేశించబడిందో ఆ ప్రజలు సకాలంలోనే ద్వితీయ ప్రణాళికను గురించి ఆలోచించసాగారు.

మూడుసంవత్సరాల పైనుంచి ప్రణాళిక అమలులో వుంది. దాని ఆశయాలు, లక్ష్యాలు స్పష్టంగానే వున్నాయి. రాజ్యాంగచట్టంలో పొందుపరచిన సామాజికవిధాన లక్ష్యాలను సాధించటం అయినప్పటికీ అ. భా. కాంగ్రెస్ కమిటీ యీ ఆశయాలను పునరుద్ఘాటించి, గరిష్టతర వుత్పత్తి,

సంపూర్ణ ఉద్యోగావకాశాలు, సామాజిక, ఆర్థిక న్యాయాలు ఆశయాలుగా గలిగిన సమాజవ్యవస్థను మార్గాలను సూచించ వలసిన అవసరాలను సకాలంలో గుర్తించింది. పై జెప్పిన ఆశయత్రయంలోని ప్రతి ఆశయంయెడ మనం చూపించే శ్రద్ధాసక్తులమీద మన నవసమాజ స్వరూపం ఆధారపడి వుంటుంది. ప్రజల్లో చాలమందికి పై జెప్పిన వరుసప్రకారం జాతీయసంపద నభివృద్ధిచేయుటమే ప్రధానంగా కనిపిస్తోంది ఈ ప్రతిపాదన అనుకొన్న విధంగా స్వయంసాక్షీభూత మౌతుందా? యాభై సంవత్సరాల నాటి స్థితితో పోల్చుకొంటే యీనాటికి అనేక శాఖల్లో, అంటే పంచదార, సిమెంట్, ఇనుము, ఉక్కు వగైరాలు, విపరీతమైన వుత్పత్తి జరిగింది. అయినప్పటికీ యే పారిశ్రామిక వేత్తగాని, ఆర్థిక శాస్త్రవేత్త గాని, రాజకీయవేత్తగాని పై అభివృద్ధిఫలితంగా వుద్యోగావ కాశాలు పెరిగాయని చెప్పినా, ఆర్థికవిభేదాలు తగ్గాయని చెప్పినా సాహసమే ఔతుంది ఆవిధంగా అనుకోవటం సాధ్యంగాకపోతే యీనాటి మన ఆశయసాధనకు, నేటి మన సమస్యకూడ యిదేగనుక, సగటు వుత్పత్తిని పెంచటం యింతట్లో తోడ్పడదు.

ఆ సమస్య నిరుద్యోగం పెంపొందటం. ఇటీవల ప్రతి సంవత్సరం వుద్యోగార్హులైనవారు 18లక్షలమంది తయారౌతున్నారు. అనగా యిప్పటికి దేశంలోవున్న భారీపరిశ్రమల, పాతవి, కొత్తవి అన్నీకలిపి, లోనియమితులైన వారిసంఖ్యలో యీ సంఖ్య మూడింట రెండువంతులకు కొంచెం తక్కువగా వుంటుంది. అందువల్ల ఈ క్రొత్త బలగంలో ప్రముఖ భాగాన్ని

నియమించటానికి యెంతవరకు పరిశ్రమాభివృద్ధి జరగాలో అంచనా వేసుకోవటానికి ఒక అభిప్రాయం యేర్పడుతున్నది. కాని జరుగవలసిందంతా అంతేకాదు. ఇప్పటికే పల్లెపట్టులనూ, పట్టణప్రాంతాల్లోనూ నిరుద్యోగం బహుళ వ్యాప్తంగావుంది. ముఖ్యంగా పల్లెప్రాంతాల్లో అసంపూర్ణ వుద్యోగ పరిస్థితి మరీయెక్కువగా వుంది. షుమారు యిరవై సంవత్సరాల క్రితం శ్రీ యం. విశ్వేశ్వరయ్య పట్టణ, గ్రామీణ ప్రాంతాలు రెంటిలోనూ కలిపి దాదాపు ఐదుకోట్లమంది నిరుద్యోగులున్నారని అంచనా వేశారు. ఇటీవల 1951లో తీసుకున్న జనాభా లెఖ్ఖల్నిబట్టీ, వ్యవసాయకూలీ విచారణలు వగైరా తదితర పరిశీలనలనుబట్టీ తేలిన యీ సంఖ్య షుమారు పది కోట్లు. మనదేశంలోవున్న నిరుద్యోగం యితరదేశాల్లోలాగ ప్రాంతీయం, సంవత్సరంలో కొంతకాలం మాత్రమే వుండేది కాదు; ఏడెనిమిది సంవత్సరాలనుంచి తీవ్రంగా కృషిచేస్తున్నప్పటికీ పరిష్కరింపబడకుండా నిత్యదారిద్ర్యం, ఆకలి రూపంలో మనచుట్టూ తాండవవిస్తున్న పరమసత్యం యీ సమస్య.

పారిశ్రామిక వుత్పత్తి యెంత అభివృద్ధి చెందినప్పటికీ సగటున మనిషి ఆదాయంమాత్రం పెరక్కుండా దాదాపు అలాగే వుండిపోయింది. దానికారణమేమంటే పెట్టుబడి అభివృద్ధి విధానంమీద ఆధారపడి కొద్దిమంది శ్రామికులతో వుత్పత్తిని అధికతరం జేసినందువల్ల కొనుగోలు శక్తి గలిగిన కొంతమంది వినిమయదారులకు కొంచెం చౌకగా సరుకుల్ని అందించ గలగవచ్చు. (తప్పనిసరిగా యిలాజరుగుతుందనే నమ్మకం యేమీలేదు). వుత్పత్తికొరకు నియోగింపబడిన

కొద్దిమందికికూడ కొంతప్రయోజనం కలగవచ్చు. ఉద్యోగావకాశాలను పెంపొందించటం, సగటు మనిషి ఆదాయం పెరగటం, ఆర్థిక వ్యత్యాసాల నిర్మూలన విషయాలలో దీనివల్ల వచ్చే మార్పు చెప్పుకోతగినంతగా వుండదు. ఈ త్రివిధ దృక్పథంవల్ల మనం యేర్పాటుచేసుకొనే కార్యక్రమం వుత్పత్తి విధానంలో వుద్యోగావకాశాలను అధికతరం చేయటం, సమిష్టి క్షేమంకోసం ఆయారంగాల్లో నియమితులైనవారు, పాల్గొనేవారు యెక్కువగా కృషిచేయటం, అదేసమయంలో వ్యక్తిగత ఆదాయాన్నభివృద్ధి చేయటంగా వుండాలి.

ఉద్యోగార్హత వున్నవారిలో నూటికి 72మంది స్వయం సహాయంతోనే వుత్పత్తి చేసేవారు. వారందరూ కలిసి చేసిన పనివల్ల జాతీయదాయం మొత్తంలో సగం లభిస్తున్నది. ఈనాడు దేశంలో అమలులోవున్న ఆర్థికశక్తులు వారిని అసమర్థంగా, అశక్తులుగా చేయటంవల్ల సగటు మనిషి ఆదాయం బాగా తగ్గిపోవటానికి యీ అధిక సంఖ్యాకులు వుపయోగపడుతున్నారు. వ్యవసాయం చేసేభూమి పరిమాణం తక్కువ గావటంవల్ల యెక్కువ నష్టదాయకంగా వుండి దేశీయాదాయ, ఖర్చు అంచనాలను సరిపెట్టలేక పోతున్నది. భూఖామందు సర్వదా ఋణగ్రస్తుడై వుండటంవల్ల దోపిడికి గురౌతున్నాడు. అతనికున్న అవకాశాలు తక్కువ, చిక్కుల్లోనుంచి బయటపడే శక్తి అసలే శూన్యం. అందువల్ల జాతీయావసరాల్లో ప్రప్రథమమైన దేమంటే వ్యవసాయదారుడు పరాధీనతనుంచి, దోపిడినుంచి బయటపడేటట్లుచేసి, నీటివసరులు, శాస్త్రీయ పద్ధతులపై వ్యవసాయం చేయగల అవకాశాలు కల్పించాలి.

నీటివసతులు, విద్య, సహకారం, వ్యవసాయ సంస్కరణలతో చతుర్విధ కార్యక్రమం, ప్రథమ పంచవర్ష ప్రణాళికలో వలె, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కూడ ప్రముఖస్థానం ఆక్రమించాలి.

గ్రామీణ ఆర్థిక స్థితి కేవలం వ్యవసాయంమీద ఆధారపడివున్న మనదేశంలాటి యితరదేశాలను చూద్దాం. అక్కడ పశుసంపద, వ్యవసాయానికి సంబంధించిన యితర పరిశ్రమల వల్ల సంవత్సరం పొడుగునా పనిదొరికి, సాగుచేసేభూమి కొద్దిపాటిదై రైతు జీవితపోషణకు చాలక పోయినప్పటికీ, మరి కొంత ఆదాయం రావటానికి అవకాశం లభిస్తోంది. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో కంటె యిప్పుడు పశుసంపద (ఆవు, యెద్దులు) నెక్కువ శ్రద్ధతో పెంపొందించాల్సిన అవసరం వుంది. బొంబాయిరాష్ట్రంలో యిటీవల పొందిన అనుభవాన్ని బట్టి యీ విషయమై ప్రభుత్వం ఖర్చుపెట్టి శ్రద్ధతీసుకుంటే యిప్పటివరకూ స్వయం వుద్యోగులుగానే తమకున్న కొద్దిపాటి భూమిని సాగుచేసుకుంటూ, కొద్ది పాడి పశువులను మేపుకుంటూ వుండే రైతుపరిస్థితి చాలవరకు మారవచ్చు.

మన గ్రామీణ ఆర్థికస్థితి యిప్పటివలె అస్తవ్యస్తంగా లేదు పూర్వం. గ్రామీణులు తమ దైనందిన అవసరాలకు కావలసిన వస్తువుల్ని వుత్పత్తిచేసుకొనేవారు. వారు వుత్పత్తి చేసుకోలేని వస్తువంటూ సాధారణంగా వుండేదికాదు. ఈనాడు కూడ, సామాజికమార్పులతో, బ్రిటీషువారు గ్రామీణ పరిశ్రమల్ని నెలకొల్పటంతో ఆర్థికస్థితి విచ్ఛిన్నమైపోయి నప్ప

టికీ, వారి అవసరాల కొకవలసిన వస్తువుల్ని వారే తయారు చేసుకోగలిగిన స్థితిలోనే వున్నారు. కాని విదేశాలనుంచి దిగుమతై, తర్వాత స్వదేశంలోనే భారీయంత్రాలవల్ల వుత్పత్తైన చౌకబారు, ఆకర్షణీయమైన వస్తువులు చెలామణిలో కొచ్చి గ్రామీణ సరుకుల తయారీని దెబ్బకొట్టినవి. ఆచారం పోయేటప్పటికి వస్తువు నాణ్యాం, వుత్పత్తి పరిమాణం తగ్గిపోయి చివరకు పరిశ్రమలే అంతరించిపోయినవి. ఈ వృత్తులమీద, యితరవిధాలైన చిల్లరపనులమీద భూమిలేని వారు, సంవత్సరంపొడుగునా పనిలేనివారు, అసలు పనిలేని వారు చాలవరకు ఆధారపడి కుటుంబాదాయాన్ని కొంతవరకు నిలబెట్టుకొనేవారు. ఇప్పుడు యిటువంటి వ్యక్తులందరూ తమ కుటుంబాలకే గాక మొత్తం సమాజానికే బరువుగా తయారైనారు. జాతీయ వ్యక్తిగత ఆదాయం పెరకుండా అడ్డుపడుతున్నవారు వీరే. అందువల్ల వీరి శ్రమశక్తిని సవ్యంగా వుపయోగించుకొనే మార్గాల నన్వేషించక పోతే వుద్యోగావకాశాల నభివృద్ధిచేసే పథకంగాని, జీవన ప్రమాణాన్ని వృద్ధిచేసే ప్రణాళికగాని యేదీ విజయవంతం కాజాలదు. కాబట్టి యీ ప్రాంతాల్లో భారీపరిశ్రమల్ని స్థాపించే ప్రయత్నం చేయకూడదు. అలా అయితే ప్రస్తుతమున్న పరిస్థితి మరింత తీవ్రమౌతుందేగాని తగ్గదు. ఏడు సంవత్సరాల క్రితం యేర్పడిన ఆర్థికకార్యక్రమసంఘం ఆహార, వస్త్ర, తదితర వినిమయ వస్తువుల వుత్పత్తికి వికేంద్రీకరణ సూత్రాలపై ఆధారపడిన కుటీర, చిన్న పరిశ్రమల్ని స్థాపించాలని చెప్పింది యీ దృక్పథంతోనే.

ఈ సమస్యను మరో దృక్పథంనుంచి పరిశీలించినప్పటికీ యీ నిర్ణయానికే రావలసి వుంటుంది. అ. భా. కాంగ్రెస్ కమిటీ అజ్మీర్ సమావేశంలో పారిశ్రామిక విధాన ప్రకటనలో పారిశ్రామికాభివృద్ధి అవసరాన్ని గురించి ప్రస్తావించబడింది. బహుశా యీ పరిశ్రమాభివృద్ధి ప్రధాన పరిశ్రమలు, ముఖ్య జాతీయావసర వస్తువుల వుత్పత్తికి వుద్దేశింపబడినవై వుంటాయ్. ఈపరిశ్రమలు యేవిధంగా స్థాపించబడాలి, నడవబడాలి అనేవిషయాన్ని చర్చించటం యీ వ్యాసం వుద్దేశం కాదు. కాని ఆర్థికావకాశాలను వినియోగించే విషయం నిర్ణయించేటప్పుడు యీ పరిశ్రమలకే ప్రథమస్థానం యివ్వాలనేది వేరుగా చెప్పనక్కరలేదు. కుటీర పరిశ్రమలవల్ల, చిన్న పరిశ్రమలవల్ల సాధ్యంకాని జాతీయావసరాలకు కావలసిన కీలక వస్తువుల వుత్పత్తికి కావలసిన యంత్రసామగ్రి వగైరాలు మన చేతులో వుండటంవల్ల విదేశాలమీద ఆధారపడే దుస్థితి తప్పుతుంది. కీలక వస్తువుల వుత్పత్తికి, భూమిసాగు నభివృద్ధి చేసే కార్యక్రమాలకు జాతీయ సంపదను వినియోగించటం వల్లనూ, లేక అట్టి వినియోగానికి కేటాయించటం వల్లనూ యితర విధ వుత్పత్తి సాధనాలకు వ్యయపరచే అవకాశాలు సహజంగా పరిమిత మాత్రవి. అందు ముఖ్యంగా వినిమయ వస్తువుల వుత్పత్తి పెట్టుబడి విస్తృత విధానంవల్లగాక, శ్రమ విస్తృత విధానంవల్ల జరిగేటట్లు, అభివృద్ధి చెందేటట్లు చూడాలి. అధికంగా పెట్టుబడి పెట్టకుండా ప్రస్తుతం దేశంలో విరివిగా లభ్యమయే మానవ శ్రమశక్తినీ, పరికరాలను వినియోగించుకొంటూ, అటువంటి కృషికి దేశవ్యాప్తంగా ప్రజల్లో

చైతన్యోత్సాహాలను కలిగించి వారిని కార్యోన్ముఖులను చేసి నప్పుడు వినిమయ వస్తూత్పత్తిని విస్తృతం చేయటం సాధ్యమౌతుంది.

ఆ ప్రోత్సాహం దానికై అది సంపూర్ణంగా వుండక పోవచ్చు; అవసరానికి సరిపోకపోనూవచ్చు ఈ విషయాన్ని గుర్తించి ప్రణాళికాసంఘం అటువంటి వినిమయ వస్తువుల వుత్పత్తికి రాష్ట్రప్రభుత్వాలు ఆర్థికసహాయంతో తోడ్పడాలని నిర్దేశించింది. ప్రతి పరిశ్రమకూ కావలసిన అవసరాల మీద యీ సహాయస్వరూపం ఆధారపడివుంటుంది. ఉత్పత్తి రంగాల కేటాయింపు, కుటీరపరిశ్రమల క్షేమండ్రష్ట్యా కేంద్రీకృత భారీపరిశ్రమల అజమాయిషీ, సహకారపద్ధతుల్లోనూ, వ్యక్తిగత స్వీయవృత్తుల ద్వారాను వుత్పత్తిచేసే వ్యక్తుల క్షేమాలను పరిరక్షించటంకోసం నిర్మాణయుతమైన పరిశ్రమలవల్ల వుత్పత్తి జరిగిన వస్తువులమీద పన్ను విధించటం వగైరాలు రాష్ట్రప్రభుత్వాలు అనుసరించే విధానంగా వుండవచ్చు. ప్రధాన గ్రామపరిశ్రమలైన దంపుడుబియ్యం, గానుగనూనె, యింత ప్రధానమైన కుటీరపరిశ్రమ నిప్పుపెట్టెల తయారీ విషయంలో అ. భా. ఖాదీ, గ్రామపరిశ్రమల బోర్డు పై జెప్పిన విధానంలో ప్రతిపాదించింది. ఈ వ్యాసంలోనూ, ఆర్థిక కార్యక్రమ సంఘ నివేదికలోనూ, అ. భా. కాంగ్రెస్ కమిటీ అజ్మీర్ సమావేశంలో ఆమోదించబడ్డ పారిశ్రామిక విధాన ప్రకటనలోనూ వివరించిన సూత్రాలు జరగవలసిన తక్షణ కార్యక్రమాలను రూపొందించటాని కుపయోగించినట్లైతే, వుత్పత్తి శక్తి వినియోగానికి కేటాయించబడ్డ కుటీర

గ్రామపరిశ్రమల అభివృద్ధికి యీ సూత్రాలు, యితర విధ రక్షణచర్యలు అనుసరించబడితే కార్యాచరణ చాల సులభ సాధ్యమౌతుంది. అలా కాకపోయినట్లైతే కేవలం కీలు బొమ్మల్ని సృష్టించటమే ఔతుంది.

ఆవిధంగా కార్యాచరణ సులభసాధ్యం చేయబడిన నాడు, యీ పరిశ్రమలు యిప్పటివలె అప్పటప్పట పనిచేసి అసమగ్రంగా వుండే దశతొలగి నిరంతరం పనిచేసి, వుత్పత్తిని పెంచి, ఆదాయ పరిమాణాన్ని పెంచేదశ, పరికరాలు, సాంకేతిక విజ్ఞానం పెరిగేదశ కలుగుతుంది. అప్పుడు యీ పరిశ్రమలు సహకార పద్ధతులద్వారా, లాభదాయకంగా నడప టాని కవకాశ మేర్పడుతుంది. ప్రస్తుతం వొంటరిగా, వ్యక్తిగతంగా వుత్పత్తి చేస్తున్నవారు దోపిడీ కాకుండా కాపాడబడాలంటే, అప్పు, నవీనసామగ్రి, ముడిసరుకులు, మార్కెట్ సౌకర్యాలు ప్రభుత్వ పరంగా లభించాలి. అలా ప్రభుత్వం దేశీయ ఆర్థికస్థితిని పెంచేదృష్టితో తోడ్పడకపోతే పైవారికి ప్రోత్సాహం కొరతవడి ముందుకురారు ఈ పద్ధతివల్ల కలిగే ప్రియోజనం సమిష్టికృషితో యేదో వొకవిధమైన భౌతిక క్షేమాన్ని, ఆర్థికాభివృద్ధిని సాధించటం వొక్కటేకాదు. స్వకీయ వృత్తులలో వున్న వ్యక్తిగత వుత్పత్తిదారులకు యీ పద్ధతిని ప్రోత్సాహాన్ని కలిగించటంద్వారా వారి జీవితాలను పునర్నిర్మించటంవల్ల నైతికబలం వృద్ధికావటం, సహజీవనభావం, ఆశయంలో, ఆచరణలో అది అంగీకరించే ప్రాథమిక సాంఘిక న్యాయం, ఆచరణద్వారా యీ పద్ధతి కలిగించే సమిష్టిక్షేమం కోసం పనిచేసే అలవాటు వగైరా సత్ఫలితాలు కలుగుతాయ్.

కాని వుత్పత్తి, సహకారోద్యమం దేని కదే విజయవంతం కాజాలవు. రెండూ కలిసి మెలిసి సాగిపోవాలి.

(అ. భా. కాంగ్రెస్ కమిటీ ఎకానామిక్ రివ్యూపత్రిక జనవరి సంచికనుంచి)



చే నే త ప రి శ్రి మ

# జాతీయ విస్తరణా వుద్యమం: దాని ప్రాముఖ్యత

శ్రీ వి. టి. కృష్ణమాచారి.
( జాతీయ ప్రణాళికాసంఘ ఉపాధ్యక్షుడు )

---

" భారతదేశ స్వాతంత్ర్యం కేవలం రాజకీయ ప్రయోజనాలను మాత్రమేకాక సమస్త ప్రజలకు అనారోగ్యంనుంచి, దారిద్ర్యంనుంచి రక్షణయివ్వవలెనని లోగడ భావించబడింది. భారత దేశంపై సంపూర్ణ బాధ్యత వహిస్తున్న భారత ప్రభుత్వం కార్మిక, కర్షక ప్రజానీకం అభ్యుదయానికి తగుప్రణాళికలను రూపొందించి అమలు పరుస్తున్నది. ఇందులో యింతవరకు సాధించ బడిన విజయాలు గర్వకారణ మైనవికూడ. "

రెజినాల్డ్ సోరెన్‌సన్.



మధుర (మద్రాసు రాష్ట్రం) వద్ద గాంధిగామ్‌లో సమాజవికాస కేంద్రాల
కార్యక్రమం కొనసాగించటానికి తరిఫీదుకొరకు వచ్చిన మహిళా జట్టులో నొకావె
వీధిదీపాలను తుడుస్తున్న దృశ్యం. స్వయం సహాయం యీ కార్యక్రమ లక్ష్యం.

పంచవర్ష ప్రణాళికలో జాతీయ విస్తరణోద్యమం అనేక విధాల అత్యంతప్రముఖమైనది. మన ప్రధాని యిది విప్లవాత్మకమైనదని అభివర్ణించారు. ఐక్యరాజ్యసమితి యిటీవల యేర్పాటుచేసిన ఒక సంఘంవారు "ప్రస్తుతం ఆసియాలో ఆర్థికాభివృద్ధి, సామాజికాభివృద్ధి విషయాలలో జరుగుతున్న అత్యంత ప్రముఖమైన ప్రయోగ" మని యీ కార్యక్రమాన్ని చిత్రించారు. అందువల్ల దీని గమ్యాలు, ఆదర్శాలు దీని జయాపజయాలను నిర్ణయించటానికి చేసే పరీక్షామార్గాలను స్పష్టంగా అర్థంచేసుకోవాలి.

సామాన్యంగా యీ వుద్యమం యొక్కడో వరాయి దేశాలనుంచి దిగుమతి కాలేదని గుర్తుంచుకోవటం అవసరం. స్వదేశంలోనే అనుభవంద్వారా అభివృద్ధిచెందింది. అనేక సంవత్సరాలపాటు భారతదేశ మంతటా జరిగిన ప్రయోగాల ఫలితంగా రూపొందింది. దీని మూలాన్ని తెల్సుకోడానికి మహాత్మాగాంధీ అధ్వర్యాన శాంతినికేతనంలో డాక్టరు టాగూరుచేత నిర్మాణ కార్యక్రమవిధానం యేర్పాటు జరిగిన రోజులు, యిటీవల మద్రాసు, బొంబాయి, బరోడా మొదలైన ప్రాంతాలలో జరిగిన నిర్మాణ కార్యక్రమ కృషిని గుర్తుకు తెచ్చుకోవాలి.

ఈ వుద్యమం శాశ్వతంగా వుండాలని వుద్దేశింబడింది. భారతదేశ గ్రామీణప్రాంతంలో శ్రేయోరాజ్య కార్యరూపంలో వుండటమే దీని ఆశయం. గ్రామీణాభ్యుదయ

వృద్ధి యెంత శాశ్వతమో, దానికేవిధంగా అవధులు లేవో అదే విధంగా ఈ కార్యక్రమం అటువంటిదానిని పురోగమింప చేయటానికి శాశ్వతమైన వుద్యమం అవసరం. ఈ నిర్మాణం అధికార, అనధికార యుతంగా యేర్పాటైంది. అధికారరీత్యా గ్రామ, తాలూకా, తహశీల్, జిల్లా, రాష్ట్రలవారీగా విధాన నిర్ణయం జరుగుతుంది. ప్రతిదశలోను పాలకవర్గ కృషిని బల పర్చటానికి ప్రాంతీయనాయకులు సిద్ధంగా వుండాలి. అంటే అధికార, అనధికారవర్గాల సమిష్టికృషితో యీ కార్యక్రమం కొనసాగాలి. గ్రామ నిర్మాణం - గ్రామ సేవకులు, గ్రామ పంచాయితీ లేక ఉత్పత్తిసమితి - ఈ కార్యక్రమంలో ముఖ్యమైన పాత్ర వహించాలి. వారి శ్రద్ధాసక్తులపైన, సత్కృషి పైన కార్యక్రమ విజయం ఆధారపడివుంది.

ఉద్యమ ఆశయాలను అతి స్పష్టంగా అర్థంచేకోవాలి. ఇది గ్రామీణ జీవితంలోని కొన్ని విషయాలనేగాక సమగ్ర గ్రామీణ జీవితాన్ని పరామర్శిస్తుంది. భారతదేశం, భారతీయ ప్రజలలో ఒకనూతన ప్రజాజీవిత విధానాన్ని సృష్టించటానికి సహాయపడటమే దీని ఆశయం.

దేశంలోని లక్షలాది రైతు కుటుంబాలు వివిధ సహకార సంఘాలద్వారా సంఘటితపడి స్వేచ్ఛగా నిర్ణయాలను తీసికొని వీలైనంత వరకు పెద్దపెట్టున శాస్త్రీయ వ్యవసాయక పద్ధతిని ఆచరణలో పెడుతూ, వికేంద్రీకరణ పద్ధతిని కుటీర, తదితర చిన్న పరిశ్రమలను సహాయక వృత్తులుగా చేసికొని ప్రభుత్వంనుంచి పరిశోధన, సరఫరా, పెట్టుబడి ఆదిగాగల సేవలను పొందుతూ పురోగమించటం ఒక ఆశయం. కేవలం

ఆర్థిక లాభాలను పొందటం మాత్రమే దీని మూలాశయం కాదు. సామాజిక, నైతిక విలువలను సాధించటంకూడా అతి ముఖ్యం. దేశంలోని 7 కోట్ల కుటుంబాలలో నూతనోత్తేజం, నూతన జ్ఞానం కలిగించి నూతన జీవిత విధానాలను అనుస రించి సుఖప్రదమైన జీవితాన్ని గడపడానికి వారిని ప్రోత్సాహ వంతులుగా చేయటం దీని ఆశయాలలో మరొకటి.

ఈ పరిణామం యే విధంగా సృష్టించ బడుతుంది. ఇందుకు మొదటి సూత్రం స్వాయం సహాయం. గ్రామీణ ప్రజలు తమ స్వీయ పురోభి వృద్ధికి తామే పాటు పడతారు. ఈ విస్తరణోద్యమం సాంకేతిక సలహా, సరఫరా, పెట్టుబడి వగైరాల ద్వారా సహాయ పడుతుంది. ఇదే దానికి మూల తత్వం. సహకార విధానాన్ని అన్ని రూపాలలోను వీలైనంత విశాలంగా స్థాపించటం రెండవ సూత్రం. ఈ కృషి కార్య క్రమం తీవ్రతరం చేయబడి ప్రతి కుటుంబం యిందులో పాల్గొనే టట్లు చేయాలి. అందుకుగాను యీ క్రింది సూత్రాల ననుస రించాలి.

మొదటిది, నీటి సదుపాయాలను అధికంచేసి మెట్టవ వ వసాయాన్నభివృద్ధి చేసి, యెక్కువమందికి పనికల్పించటం, వు త్తిని పెంచటం; శాస్త్రీయ వ్యవసాయక పద్ధతి, కుటీర, త తర చిన్నపరిశ్రమలను స్థాపించి రైతుకుటుంబాలకు వుపవృత్తు లను కల్పించటం.

రెండవది, సహకారోద్యమాన్ని విస్తృత పరచటం ద్వారా ప్రతి కుటుంబం కనీస మొక సహకార సంఘానికి చెంది వుండేటట్లు చేయాలి.

మూడవది, ప్రతి కుటుంబం సమాజ వృద్ధికి క్షేత్రానికి ఐచ్ఛికంగా కొంతకాలాన్ని వినియోగించి కృషి చేయాలి.

నాల్గవది, సర్వతోముఖంగా జీవిత ప్రమాణం పెరగటం కోసం సుసంఘటిత మహిళ, యువక ఉద్యమాల్ని నిర్మించాలి. ఈ సూత్రాల ప్రకారం కృషిచేయటంద్వారా జీవిత దృక్పథంలో మార్పు తేవటం యీ ఉద్యమ ముఖ్యాశయం.

పైన పేర్కొన్న మొదటి సూత్రంమీద వివరణ అనవసరం. శాస్త్రీయ వ్యవసాయక పద్ధతుల ననుసరించటం ద్వారాను, గ్రామ పరిశ్రమలు స్థాపించటం ద్వారాను ప్రతి కుటుంబానికి వృత్తి, ఆదాయం ఏర్పాటు కావాలి.

రెండవ సూత్రం క్లిష్ట సమస్యలను సృష్టిస్తుంది. సహకారోద్యమ వ్యాప్తికి జాతీయ విస్తరణోద్యమ కార్యకర్తలు ప్రత్యేక శ్రద్ధతో పనిచేయాలి. భారత దేశంలో షుమారు 50 సంవత్సరాలనుంచీ సహకారసంఘాలు పనిచేస్తున్నప్పటికీ యీ సహకార విధానం బాగా అభివృద్ధి చెందిన ప్రాంతాలలో కూడ రైతులకు నూటికి 30 మందికి మాత్రమే కోఆపరేటివ్ సొసైటీల నిబంధనల ననుసరించి పరపతి లభ్యమౌతున్నది. అంటే నూటికి 30 మంది మాత్రమే పరపతి కర్హులన్నమాట. అందువల్ల యిప్పుడున్న సమస్యయేమిటంటే మిగతా 70 మందిని కూడా పరపతి అర్హులనుగా చేయాలి. సహకార విధానాన్ని గ్రామాలలో విస్తృతంచేసి సమిష్టి కృషిద్వారా అధికోత్పత్తిని సాధించటంవల్లనే యిది సాధ్యమౌతుంది. ప్రారంభ దశలో అధికోత్పత్తిని సాధించగల స్తోమతువున్న వ్యవసాయదారులకే పరపతిని కల్పించి సవ్యమైన అజమాయిషీతో వాని

చెయ్యాలి. అంటే, పగపతి కర్తవ్యమైన వ్యక్తులమీదకాక పర పతి కర్తవ్యమైన కార్యాలమీదనే యెక్కువ శ్రద్ధచూపాలి.

మూడవ సూత్రం ప్రకారం శాశ్వత ప్రయోజనకర మైన పనులను చేయాలి—వృత్తిసంపద నభివృద్ధిచేయటం, పచ్చికబీళ్ళను పెంపుదలచేయటం, గ్రామ చెరువులను సవ్యంగా కాపాడటం, పాఠశాలలు, పఠనమందిరాలు పెంపొందించటం వగైరా కార్యక్రమాలు శాశ్వత పద్ధతిని ఐచ్ఛిక కృషితో కొనసాగించాలి.

నాల్గవసూత్రం ప్రాముఖ్యతమీద యేవిధమైన వ్యాఖ్య అక్కరలేదు. పై కార్యకలాపాలలో మహిళలు సంపూర్ణంగా పాల్గొనాలి. ఇందుకు సహాయపడటం కోసం సాంఘిక విద్యా నిర్మాణకర్తలు, గ్రామసేవకులు తగిన విధంగా తర్ఫీదును పొంది అన్ని ప్రాంతాలలోను నియమింపబడుతున్నారు.

పై జెప్పిన విషయాల దృష్ట్యా ఈ వుద్యమంయొక్క జయాపజయాలను నిర్ణయించే పరీక్ష లేమిటో స్పష్టంగా విశద మౌతున్నవి. అయితే యిప్పుడు మనం సమాధానం చెప్పవల సిన ప్రశ్నలు కొన్ని వున్నయ్. ఈ కార్యక్రమం కొనసాగే ప్రాంతాలలో (1) ఎన్ని కుటుంబాల వారు స్వయంగా కృషిచేసి సంపూర్ణమైన వృత్తి, అధికోత్పత్తి సాధనకు యేటు వంటి పథకాలను అనుసరిస్తున్నారు? (2) ఎన్ని కుటుంబాల వారు తమకున్న హోదానుబట్టి కనీసం ఒక సహకార సంఘంలోనైనా సభ్యులుగా వున్నారు? (3) ఎన్ని కుటుం బాలవారు సమాజక్షేమ శాశ్వత కార్యాలలో ఐచ్ఛికంగా పాటు పడుతున్నారు? ఇంతేగాక మహిళలు, యువకులు

ఆయా ప్రాంతాలలో నవజీవన సర్వతోముఖాభివృద్ధికి నూతనోత్తేజాన్ని కలిగించటానికీ వుద్యమంలో సంపూర్ణంగా పాల్గొంటున్నారా? లేదా?

ఈ వుద్యమం యిప్పటికప్పుడే అరవై వేల గ్రామాలలో కొనసాగుతోంది. మొదటి పంచవర్ష ప్రణాళిక గడువు పూర్తయ్యే లోపున భారతదేశంలో నాల్గవవంతు ప్రాంతానికి విస్తరించబడుతుంది. రెండవ పంచవర్ష ప్రణాళిక గడువు పూర్తయ్యేనాటికి దేశమంతటా యీ వుద్యమం వ్యాప్తిజెదటంకోసం తగు విధంగా శిక్షణ, ఆర్థికసహాయం వగైరా యేర్పాట్లు చేయబడుతున్నయ్. ఈ కార్యక్రమ ప్రాముఖ్యతను గుర్తించి భారతప్రభుత్వం రాష్ట్రాలకు ప్రారంభ ఖర్చులను భరించటానికీ శాశ్వతనిధులను యేర్పాటు చేయటంద్వారా, యితరవిధ సహాయాలు కాక, తోడ్పడ నిశ్చయించుకొన్నది.

ఈ వుద్యమం ప్రారంభమై రెండు సంవత్సరాలే అయినప్పటికీ ప్రతిచోటా ప్రజల సహకారం విపరీతంగా లభిస్తోంది. అందువల్ల అధికార, అనధికార వర్గాల సమైక్య కృషితో, యినుమడించిన శ్రద్ధతో పనిచేస్తే యీ వుద్యమం పటిష్టమై గ్రామసీమలు నవనవోన్మేషితం కాగలవు. ఇక్కడ గమనించవలసిన ఒక ముఖ్య విషయమేమంటే యీవుద్యమ చైతన్యం క్షుండా యదార్థమైన ప్రజా వుద్యమంగానే వుండి మార్పు చెందుతున్న పరిస్థితుల కనుగుణ్యంగా మారుతూ పై ఆశయాలు అక్షరాలా చరించటానికి కంకణ బద్ధం కావాలి.

(అ. భా. కాంగ్రెస్ కమిటీ ఎకనామిక్ రివ్యూ జనవరి [illegible])

# సామాజిక ప్రాథమిక న్యాయం

కె. పి. త్రిపాఠి, యం. పి.
(అ. భా. ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి)

'ఓర్వలేమి పిశాచి దేశం
మూలుగులు పీల్చె నోయి,
ఒరుల మేలుకు సంతసిస్తూ
ఐకమత్యం నేర్చవోయి !'

గురజాడ అప్పారావు.



జాతీయ విస్తరణ కార్యక్రమంలో వయోజనులకు రాత్రిపాఠశాల దృశ్యం.



మద్రాసులో, పెరంబూర్, నిర్మించబడుతున్న రైలు పెట్టెల నిర్మాణ
కర్మాగారంలోని ఒకభాగం.

సమాజానికి ప్రాథమిక న్యాయం మూలం. అనగా సమాజంలోవుండే అన్నిరకాల సంబంధాలకు మూలం న్యాయమని గుర్తించబడినప్పుడు సంఘర్షణకు కారణాలైన అంశాలు సమసి పోతాయ్. అలాగాక ప్రాథమిక న్యాయం తిరస్కరింపబడ్డప్పుడూ, అసలు లేకుండా చేస్తేనూ, సాంఘిక సంబంధాలన్నీ అన్యాయంమీద ఆధారపడి నిర్మితమైతేనూ సంఘర్షణ తాండవిస్తుంది. ఈ విషయాలపట్ల సకాలంలో తగుశ్రద్ధ తీసుకోకపోతే అవమాన వ్యధ పెచ్చుపెరిగి సమాజం విషపూరితమై విప్లవ రూపంలో విచ్ఛిన్న మవుతుంది.

ప్రపంచమంతటా సక్రమ పరిపాలన, రాజకీయ దురంధరత్వంయొక్క లక్ష్యాలు, కృషి యెప్పుడూ యిటువంటి సంఘర్షణాంశాలను, నిర్మూలించ లేకపోయినప్పటికీ, తగ్గించటానికే వినియోగించ బడినయ్.

అందువల్ల న్యాయం లోపించినప్పుడు అటువంటి న్యాయం పునఃస్థాపితమై, సంఘర్షణాంశాలు తగ్గిపోవటం కోసం కృషిచేసే శక్తి, సామర్థ్యాలనుబట్టీ, సాధించే విజయాలనుబట్టీ ప్రతి పారిపాలనయొక్క మంచి, చెడ్డల్ని నిర్ణయించటం జరుగుతుంది.

ఈ దృష్టితో, మనదేశంలో కాంగ్రెస్, మన రాజకీయ నాయకత్వం ముఖ్యంగా పెట్టుబడిదారుల, శ్రామికుల సంబంధాలలో వున్న సంఘర్షణాంశాలను యెంతవరకు నిరూలించ ప్రయత్నించాయో పరిశీలిద్దాం.

స్వాతంత్ర్యంకోసం పోరాటం జరిగే రోజుల్లో, పెట్టు బడిదారీ, శ్రామికవర్గాల మధ్య యీ సామాజిక న్యాయం నెలకొనాలని కాంగ్రెస్ ప్రబోధించింది. తత్ఫలితంగా శ్రామిక వర్గంలో కొన్ని ఆశలు రేకెత్తినవి. ఈ ఆశలు శ్రామికులలో న్యాయభావాన్ని గాఢంగా నాటినవి. స్వాతంత్ర్యానంతరం యీ ఆశలు తీరటం, తీరకపోవటం అనేదాన్ని న్యాయం పాలింపబడటం, పాలింపబడకపోవటంగా వ్యాఖ్యానించటం సహజంగా జరుగుతుంది.

ఆవిధంగా పెంచుకొన్న ఆశల్లో కొన్ని యివి :

1. జీతం - కూలి పద్ధతిలో వున్న తేడాలు తగ్గింప బడతాయ్ ;
2. కూలీలకు జీవితపోషణకు సరిపోయినంత కూలి యేర్పాటుచేయబడుతుంది ;
3. వారి వుద్యోగాలు రక్షింపబడతాయ్ ;
4. ఆరోగ్యం కాపాడబడుతుంది ;
5. వృద్ధాప్యంలో భృతి యివ్వబడుతుంది ;
6. అందరికీ వుద్యోగాలు దొరుకుతాయ్ ;
7. లాభాలలో భాగం వుంటుంది.

జరిగిన యేడు సంవత్సరాల పాలనలో కాంగ్రెస్ పై వాటిలో కొన్నిటిని తీర్చటానికి ప్రయత్నించింది. కనీస వేత నాల చట్టం ఆమోదించబడి విజయవంతంగా అమలు జరుప బడుతోంది. పారిశ్రామిక వివాదాల చట్టం, వుద్యోగావ కాశాలు, తొలగింపుసంబంధమైన సవరణలు ఆమోదించ బడి, శ్రామికులు యజమానుల దయాధర్మం మీద ఆధార

పడి జీవించవలసిన పరిస్థితులను తొలగించి, వారి హక్కుల్ని కాపాడుతున్నది. కార్మిక భీమాపథకం ప్రవేశపెట్టబడి, విస్తృతంగా అమలుజరుపబడుతోంది. ప్రావిడెంట్ ఫండ్ పద్ధతికూడ విస్తృతం చేయబడుతోంది. ఈ శ్రామిక క్షేమ పద్ధతులు ప్రస్తుతం కొద్దిమందికే వుపయోగపడుతున్నప్పటికీ కాలక్రమాన పారిశ్రామిక శ్రామికులలో అధిక సంఖ్యాకులకు యెంతో మేలు చేకూర్చగలవని ఆశింపబడుతున్నది.

ఆదాయ వ్యత్యాసాలను తొలగించటానికి ప్రభుత్వం మరణసుంకాల చట్టాన్ని తయారుచేసింది. ఇంతేగాక, ఇంకా ముందుకువెళ్ళి, యితరులకు ఆదర్శప్రాయంగా మంత్రులకు జీతాలను తగ్గించింది. ఈ చర్య, జీతం–కూలి మధ్యనున్న విభేదాన్ని తొలగించటం అనేది, సమాజంలోని యితర విషయాలలోకూడ ప్రాథమిక న్యాయంగా గుర్తింప బడిందనే అభిప్రాయం ప్రజల్లో వ్యాప్తిచెందటాని కవకాశ మిచ్చింది.

కాని యీ భావాన్ని సమాజం యింకా స్వీకరించలేదు. సివిల్ వుద్యోగులు స్వచ్ఛందంగా తమకై తాము ముందుకు రావటంలేదు. ప్రైవేటు రంగంలో జీతాలను తగ్గించటానికి బదులు యింకా పెంచటం జరిగింది. ఇతరదేశాల అనుభవాన్ని బట్టిచూస్తే మరణసుంకాల విధింపువల్ల ఆదాయ వ్యత్యాసాలు కొద్దికాలంలోనే తొలగింప బడతాయనే నమ్మకమేమీ కనిపించదు. అందువల్ల యీవిషయమై ప్రజల్లో తీవ్రమైన అసంతృప్తి పెచ్చు పెరుగుతున్నది. శ్రామికవర్గం కూలిని పెంచమనీ, బోనస్ కావాలనీ, విపరీతపు జీతాలు వగైరాలమీద నిరసన ప్రకటిస్తూనూ చేసే ఆందోళనలో యీ అసంతృప్తి

వ్యక్తమౌతోంది. బ్యాంకు అవార్డ్ సందర్భంలో యేర్పడిన అలజడిలో యీ విషయాల ప్రస్తావన తీవ్రరూపం దాల్చింది. ఆసందర్భంలో మనప్రధాని కల్పించుకొని విపరీతమైన జీతాల పద్ధతిని తాను హర్షించనని చెప్పటం జరిగింది. కాని యీ జీతం - కూలి విభేదాలను తొలగించటానికి ప్రభుత్వంగాని, ప్రైవేటు రంగంగాని ఐచ్ఛికంగాగాని, శాసనం ద్వారాగాని యేవిధమైన ప్రయత్నమూ చేయలేదు. అందువల్ల యీ అంశానికి సంబంధించిన సంఘర్షణ తీవ్రతర మౌతూనేవుంది.

ప్రజాస్వామిక విధానంలో ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని మన్నించి వారిలో అసంతృప్తి పెరక్కముందే వారికోర్కెలను తీర్చ ప్రయత్నించాలి; లేదా నిరంకుశంగా తయారై ప్రజాభిప్రాయాన్ని అణచివేయ ప్రయత్నించాలి. భారతప్రభుత్వం ప్రజాస్వామికం కాబట్టి రెండోమార్గాన్ని అనుసరించదు: కనుక యెక్కువ కాలయాపన జరక్కుండా వీలైనంతత్వరలో యీ విషయంలో సామాజిక న్యాయాన్ని కలుగ జేయటానికి ప్రయత్నించాలి.

ఇది యేవిధంగా జరుగుతుంది? ఐచ్ఛికవిధానం విజయవంతంగా సాగుతుందా? అలా అయితే చాల ముచ్చటగా వుంటుంది. మంత్రులు తీసుకొన్న చర్య అటువంటి ఆదర్శవంతమైనదే కాని యితరు లెవ్వరూ అనుసరించటం లేదు. అలా యితరులు యికముందైనా ఆమార్గాన్ని అనుసరిస్తారనే నమ్మకంకూడ లేదు. విపరీతమైన జీతాలను తీసుకొనే వారిలో తాము ఐచ్ఛికంగా తగ్గించుకోవాలనే జ్ఞానం కించిత్ కూడ కనిపించటంలేదు. జీవితస్థాయిని అత్యున్నత ప్రమా

ణంలో వుంచాలనే ఆదర్శం మరింతగా ప్రకటితమౌతున్నది. ఈ పరిస్థితులలో ఐచ్ఛికంగా తగ్గించుకోవటం, ప్రజల్లోని అసంతృప్తి పెచ్చు పెరక్కుండా నివారించటం అనేవి యింతట్లో సాధ్యమయ్యేటట్లు కనిపించటం లేదు.

అందువల్ల చట్టరీత్యా, హింసాప్రయోగం లేకుండా, సకాలంలో యేవిధంగా యీ న్యాయాన్ని కలిగించటానికవకాశా లున్నాయో ఆలోచించటం కాంగ్రెస్‌కు చాల అవసరం.

అది యేవిధంగా జరగాలి? చాలమార్గాలున్నవి. కాని సామాజిక న్యాయరీత్యా జరగటం చాల వుత్తమ మార్గం. బ్యాంకు అవార్డ్ సందర్భంలో జరిగిన చర్చల్లో యీవిషయం ప్రస్తావించబడినప్పుడు శ్రామికవర్గానికి జీవితావసరాలకు సరిపడు జీవనభృతికూడ లేకుండా వున్నప్పటికీ పై వుద్యోగులకు నెలకు సుమారు 20,000 రూపాయలవరకు జీతం ముట్టుతున్నదని తేలింది. ఇంతేగాక పై పెచ్చు యితర సౌకర్యాలు, బోనస్ వగైరా లాభాలను విపరీతంగా పొందుతున్నారనికూడ స్పష్టమైంది. ఈ పద్ధతిని అరికట్టాలి. ఒక సంస్థ తన వుద్యోగుల్లో ఒక భాగానికి చాలీచాలని కరువు కూలినిస్తూ, యింకోభాగానికి విపరీతపు జీతాలనిస్తూ, యితర సౌకర్యాలను కలిగించటం క్షమించరాని నేరం. ఇది అన్యాయమని గుర్తిస్తే అట్టిదాన్ని అరికట్టటమే న్యాయం. అటువంటి న్యాయానికి హామీయిస్తే, ఆ న్యాయం అమలు జరపటానికి చట్టంచేయుటం యేవిధంగానూ తప్పుకాదు. అందువల్ల మనం యిలా నిర్ణయించుకోవచ్చు.

ఏ పారిశ్రామిక సంస్థగాని, యితర సంస్థగాని తన వుద్యోగుల్లో క్రిందితరగతివారికి సరియైన జీవసభృతి నివ్వనిదే పై వుద్యోగులకు, వారి జీతాలు, బోనస్, యితర సౌకర్యాలు అన్నీ కలిపి, ఒక నిర్ణయమైన మొత్తంకంటే యెక్కువ యివ్వకూడదని చట్టంద్వారా శాసించాలి. ఉదాహరణకు గరిష్టతరమైన జీతం, మొత్తం భారతదేశ పాలనాబాధ్యతను వహించే ప్రధానిజీతంగా వుండవచ్చును. సరియైన జీవితభృతిని ప్రణాళికాసంఘం సమిష్టి సంప్రదింపులద్వారా నిర్ణయించ వచ్చును.

ఏ సంస్థ అయినా తన వుద్యోగుల్లో క్రిందితరగతివారికి సరియైన జీవనభృతిని కలిగించిన తర్వాత సంస్థ వ్యవహారాలను చక్కబెట్టే పై వుద్యోగులకు యెక్కువ సౌకర్యాలు, జీతాలు కలిగించటం సాధ్యమౌతుందని స్పష్టమౌతున్నది. అయితే క్రిందితరగతి వుద్యోగికి ప్రాధమిక జీవన ప్రమాణభృతి కల్పించబడిన తర్వాతనే యిది సాధ్యమౌతుంది. సామాజికన్యాయం దృష్ట్యా యిది సబబుగా వుంటుంది.

సామాజిక న్యాయంలో ఒకభాగంగా ప్రజల మనస్సుల్లో గాఢంగా నాటుకుపోయిన యింకో అంశం యేమంటే సంస్థల లాభాల్లో ఆసంస్థల వుద్యోగులకుకూడ భాగం పంచాలనేది. ఇప్పటికే కొన్ని సంస్థల్లో బోనస్ రూపంలో శ్రామికులకు లాభాలు ముట్టుతూనే వున్నాయి. కొన్నిటిలో అలా జరగటంలేదు. అందువల్ల మొత్తం అన్నింటిలోనూ లాభాల పంపిణీ జరగాలనే ఆందోళన పెరుగుతున్నది. బోనస్‌గాని, లాభాలుగాని కేవలం మేనేజర్లకు, యితర వుద్యోగులతో

మాత్రమే యిస్తున్న సంస్థల్లో యీ ఆందోళన శీఘ్ర గతిని మరింత తీవ్ర మౌతున్నది. ఘర్షణలుకూడ జరిగాయ్. ఉద్రేకాలు పెరిగాయ్. ఆగ్రహావేశాలు మిన్నుముట్టుతున్నయ్. యజమానులు సంకుచిత దృష్టితో దీన్నంతటినీ యెదిరిస్తున్నారు. కొంతమంది యజమానులు లాభాల పంపిణీకి అంగీకరించి, యజమానులు, శ్రామికులు భారత ప్రభుత్వం యేర్పాటుచేసిన కమిటీ సమావేశంలో యీ విధానానికి యేకగ్రీవామోదాన్ని తెలియజేసిన తర్వాత యీ తత్వం వ్యాప్తిచెందకుండా అరికట్టటానికి చేసే యే ప్రయత్నమైనా నిష్ప్రయోజనమౌతుంది. ఈ విషయంలో జాప్యం చేయటంవల్ల సామాజిక న్యాయాన్ని భగ్నం చేయటంతప్ప మరొకటి జరగదు. పారిశ్రామిక, వ్యాపార, యితర సంస్థలన్నిటిలోనూ ఒకేవిధమైన న్యాయసమ్మతమైన విధానంలో యీ లాభాల పంపిణీ అమలు జరిపే సూత్రాలను రూపొందించటం శ్రేయస్కమని నా అభిప్రాయం. పూర్తిగ సక్రమమైనది కాకపోయినా కొంతవరకైనా న్యాయ సమ్మతంగా సర్వవ్యాపితంగా అమలు జరుపదగు విధానాన్ని వెంటనే రూపొందించటం అవసరం. ఇతర విధ సామాజిక ధర్మసూత్రాల వలెనే యిదికూడ అనుభవాన్ని బట్టి అవసరమైనప్పుడు మార్పు చేయబడవచ్చు. మన పొరుగునున్న ఒకదేశం, అవసరమైన సమాచారం, లెఖ్ఖల వివరాలు లేకపోయినప్పటికీ, ఆదేశంలో మిశ్రమ ఆర్థిక విధానం అమలులో వున్నప్పటికీ యీ పంపిణీ విధానాన్ని తాత్కాలికంగా అమలు జరుపుతున్నది.

ఆదేశం అమలుజరుపున్న పద్ధతిలో ముఖ్యాంశా లివి.

లాభాలు నాలుగు రకాల సమభాగాలుగా విభజింప బడినవి:

1. పంపిణీ కాదగు లాభం, 2. తరుగుదల, 3 పన్నులు, 4. శ్రామిక సంక్షేమం.

ఈ పద్ధతి తప్పుకావచ్చు, వొప్పుకావచ్చు. కాని చక్కగా పనిచేస్తోంది. ఈ సూత్రాన్ని అమలులో పెట్టిన వెంటనే సంఘర్షణ, తీవ్రతలు సమసిపోయినవి. ఎంతయెక్కువ పనిచేస్తే అంత యెక్కువ ప్రతిఫలం ముట్టుతుంది గనుక శ్రామికులు వుత్సాహంతో పనిచేస్తున్నారు. పని కుంటుపర్చటం, జగడాలు పెంచుకోవటం, సమ్మెలు చేయటం అన్నీ పోయినవి. పైగా యెక్కువ శ్రమపడుతున్నారు. ఆ విధంగా సంఘర్షణ సమసిపోయి అధికోత్పత్తి సాధకమైందీ విధానం. మన ప్రజల్లోకూడ దీనిప్రభావం యెక్కువగా వుంది. ఇంకెంతో కాలం జాగుచేయటం భావ్యంగాదు.

జీతం _ కూలి విభేదాలను తగ్గించి, లాభాల పంపిణీ విధానాన్ని అమలుజరిపే ప్రయత్నం చేస్తే సమాజంలో ముఖ్యమైన రెండు సంఘర్షణాపూరిత సమస్యలు, నేడు ప్రజలను కల్లోలపరుస్తున్నవి పరిష్కరింప బడతవి ఈ పరిష్కారంవల్ల తాత్కాలిక సంతృప్తి, భవిష్యదభివృద్ధికి పునాదులు యేర్పడతవి.

ఈ సమస్య కాంగ్రెస్ చేపట్టే విధానంమీద ఆధార పడి వుంటుంది.

(అ. భా. కాంగ్రెస్ కమిటీ 'ఎకనామిక్ రివ్యూ' జనవరిసంచికనుంచి)